బాలజేసుసాధుని యొక్క,

నవదిన ప్రసంగము



వేదాంతగ్రంథములు

# విషయసూచిక.

---

పుటసంఖ్య.

---



# పీఠిక

సుతుడైన సర్వేశ్వరుడు మనుష్యులను రక్షింప మనుష్యస్వభావమును దాల్చి, భూలోకములో మనుష్యుడుగా జీవించినారనుట సరియే. వారు మనుష్యస్వభావము ఎత్తుకొనవలసినట్లయితే, వారు పడుచు ప్రాయమునందైనను, యవ్వన ప్రాయమునందైనను, మనుష్యస్వభావము నెత్తుకొనవచ్చునే. ఆదితండ్రి సృష్టించబడినపుడు మంచినభిప్రాయము గలవాడుగా కలిగించబడినాడు గదా? చిత్తమైనట్లయితే సుతుడైన సర్వేశ్వరుడును ఆలాగే మనుష్యరూపము యెత్తవచ్చును. అట్లుండగా జేసునాథుడు ఆదితండ్రివలె పెద్ద మనుష్యుడుగా పుట్టక, పసిబాలరూపముగా పుట్టిన కారణమేమి? ఎటువంటి గుణముగల మనుష్యులును పసిబిడ్డమీద పక్షముంచుదురు గదా? నిజమైన సర్వేశ్వరుడును నిజమైనమనుష్యుడుగానున్న జేసునాథుడు తమమీద మనుష్యులు పక్షముంచి తమ్మును సులభముగా స్నేహించవలయునను అభిప్రాయము కలవారై గదా పసిబిడ్డరూపమెత్తిరి. క్రీస్తువులారా! అటువంటి అభిప్రాయముమీకు ఫలించేటట్టు మీరు వారినిస్నే

హించవలసినది. ఆదివ్యబాలునిమీదమీకుపూర్ణపత్తు
ముకలిగేటట్టు వారిమీద కొన్నిప్రసంగములు విని
పించబోవుచున్నాను గనుకమీరు ఈతొమ్మిదిరోజులు
క్రమముగా గుడికివచ్చి, పరాకులేకుండా భక్తితో
వినినట్లయితే, స్వామికృపచేత ఆ దివ్యబాలుని మీరు
స్నేహించి వారినిమీరు ఘనముగా ఎంచుదురు. ఆదివ్య
బాలుడు మాట్లాడక యుండినను మీ ధర్మనడతకు
వారు ఉత్తమ ఉపాధ్యాయులుగా నుందురు ఇందు
చేత వారు పుట్టిన పండుగకు ముందు తొమ్మిదిరో
జులు రోజుకొక ప్రసంగమువంతున చదువబడును.

---

## మొదటి దినము

(దివ్యబాలుని మహిమ గొప్పతనము)

---

దివ్యబాలుడయిన జేసునాధుడు గొప్పగౌరవము
నిండినవారై యున్నారు. అదిఎలాగని ఇప్పుడు చెప్ప
బోవుదానిని వినండి. సౌందర్యముగల బాలుని చూచి
నట్లయితే వానిమీద ప్రేమకలుగునేగాని వానిని
ఘనముగా యెంచవు. ఆబాలుడు వుండెడు నగరు
గొప్పదిగాను ఆబాలుని కాచుకొనియుండెడువారలు
అనేకులుగాను ఉండుటను చూచినట్లయితే ఆ బిడ్డను
ఘనముగా ఎంచుదువే. అబిడ్డ రాజ్యమేలెడు రాజ
కుమారుడుగాను వాడు రాజపట్టమునకు స్వతం

త్రుడుగాను ఉండుటను నీవు ఎరిగినట్టయితే ముందు కంటే అధికముగా గౌరవించెదవు. పుట్టినబాల జేసు నాధుని చూచినట్టయితే వారిమీద పక్షముంచన్యాయముగలదు. లోకమహిమ ఆడంబరము లేమియు లేకుండా ఒక పశువుల కొట్టములో రెండుమృగములకునడుమ శుద్ధదరిద్రుడుగా పుట్టుటను చూచినవారలు వారిని ఘనముగా యెంచుటలేదని కొందరు చెప్పుదురు. వారు అలాగు పుట్టియుండినను వారిని ఘనముగా యెంచేటట్లు ఇప్పుడు చెప్పబోవు దానిని గమనించి వినండి.

ఈ దేవబాలుడు పరలోకమునున్ను భూలోకమునున్ను సృష్టించిన పితయైన సర్వేశ్వరుని యోగ్యకుమారుడుగదా? అబ్రహామున్ను, ఆది తండ్రియున్ను, పరలోక భూలోకమున్ను కలిగించబడుటకు ముందే వీరు ఉండిరి. ఇందుచేతవీరిని నిజమైన దేవుడని ఎంచి సర్వేశ్వరునికి చేయతగ్గ ఆరాధనను చేయవలసినది. వీరు పసిబిడ్డగానుండినను లోకారంభమునుండి లోకముగింపువరకు గల శాస్త్రులకంటే, అధికశాస్త్రము తెలిసినవారై యున్నారు. సకల అర్చ్యశిష్టులకంటే ఉత్తమ అర్చ్యశిష్టవారై యున్నారు. లోకములో గల సకలరాజులకును రాజై యున్నారు. సకలసన్మనస్కులకును, సకల మనుష్యులకును, కలిగింపబడిన వస్తువులన్నిటికి వీరు కర్తగానున్నారు. వీరిమహిమను బెత్లేమూరివారలు కొంచెమైనను ఎరిగియుండినట్టయితే,

మిగులఆశతో ఈదివ్యబాలుని తమ మందిరములలో పుట్టునటుల కోరియుందురు. ఇప్పుడు ఈ దివ్యబాలుని మీాదభక్తి మనుష్యుల హృదయములలో పుట్టించవల గిన కాలమువచ్చినది. సత్యవేదము నెఱుగనివారలు ఈదివ్యబాలుని మహిమ కనిపెట్టనందున, ముందుచె ప్పబడిన భాగ్యము హృదయములో కలుగుటకు ఏ దైననొక సాకుచెప్పుదురు. క్రీస్తువుడా! దేవబాలుడైన జేసునాధునియొక్క మహిమ, ఏమాత్రమైనను ఎరి గియున్న నీవు, ఆ సాకుచెప్ప ఎడములేదు. నిజమైన పక్షమునకు పాత్రముగలవారిని నీవు స్నేహించవల నుండుటదేమి? నీహృదయములో గల, పాప అశుద్ధ మును పోగొట్టనందుచేత, ఆస్నేహ భాగ్యమును పో గొట్టుకొనునది సరియా? ఏదొకడు తనయింటిలో పొ ర్లాడెడు అశుద్ధముగల పందిని బయటికితరిమి, ఇంటిని శుద్ధముచేసి యుంచ ఇష్టములేనందుచేత, తనయింటి లో రాజకుమారుడు పుట్టుటకు స్థలమివ్వక పోయి నట్టయితే, వాడు బొత్తిగా మతిచెడినవాడని చెప్ప బడును. మోహము, మర్మము, దొంగతనము మొద లగు ఇతరపాపములన్ని పాపాత్ములహృదయములో అశుద్ధ పందివలె పొర్లాడుచున్నవి. అశుద్ధమైన ఆమృ గముమీాద, పాపాత్మునకు ఉంచిన పక్షము నిమిత్తము, దానిని త్రోసివేసి ఆత్మను శుద్ధముచేయు మనసులేనం దుచేత, మహారాజైన దివ్యబాలునిమీాద భక్తివాని హృదయములో పుట్టించుటకు స్థలమివ్వలేదని అర్ధ

మగును. ఇందుచేత నీవు నిజమైన బుద్ధిహీనుడే సరి
గదా? ఈపిచ్చితనమునకు లోబడకుండుటకు ఈపం
దుగను ఉద్దేశించి, ఒకొకరు చేయుబోవు మంచి పాప
సంకీర్తనమువల్ల ఆత్మను శుద్ధిపరచి, ఎండినపైరుకు
నీళ్ళుపారించ ప్రయాసపడురీతిగా బాలయేసునాథుని
ఇష్టప్రసాదము ఆత్మకురాను ప్రయాసపడవలసినది.
ఇట్లాయితే నీళ్ళుపారినపైరు ఫలించులాగు ఆదివ్యబా
లుని పక్షమువలన ఆత్మ పుణ్యములో వర్ధించును.

కడన వేడుకోవలసినది: దివ్యబాలుడైన నాయేసు
నాథుడా! మీమీదభక్తి నాహృదయములోకలుగ,
నేను పాత్రుడను కాకపోయినను, మీకృపచేత నా
మనసు ఆ శిశుపక్షమునకు యోగ్యముగానుండ మీ
పితను గురించి దేవరవారిని ప్రార్థించుచున్నాను.
ఆమెన్ యేసు

దివ్యబాలునిన్ని, వారిదివ్యతల్లినిన్ని, అర్చ్య జో
జప్పగారినిన్ని గురించి 1 జ్యో. 1 ప్రి. 1 త్రి. చెప్పుట.

## ప్రతి నవదిన జపము

1 ది.—సకల ప్రమాణములేని అప్రమానమైన
జ్ఞానమా! దేవరవారు నిత్యపితయొక్క బుద్ధివలన ని
త్యులమై, ఒక ఎల్లనుండి ఇంకొక ఎల్లకు గల సకల
మునున్ను వల్లభముగాను, మధురముగాను నడిపించు

చున్నారే, రక్షణమునందును విమర్శయందును మా కుమార్గమును చూపించ వేంచేయ నవధరించండి స్వామీ...... 1 ప్రి.

2 డి.—సకల పరియంతము లేని అపరిమిత-వల్లభ మా, దేవర వారు మీ తిరువాక్కు వలన మాత్రము సకలమునున్ను కలిగించి దానినంతా మీ తిరుచిత్త మునలన మాత్రము నడిపించుచున్నారే, మీ తిరు కరవల్లభముతో పిశాచి దాసత్వమునుండి మమ్మును రక్షింప వేంచేయ నవధరించండి స్వామీ...... 1 ప్రి.

3.—సకల మితి లేని అమితస్నేహమా, దేవర వారు మంటితో కలిగించిన మనుష్యునిమీద అధిక ప్రేమ చూపించ తిరుచిత్తమైతిరే, ఇప్పుడు మా ఆత్మ లలో జ్ఞానబంధనమై మీ పత్నులుగా చైకొన వేంచేయ నవధరించండి స్వామీ ... ... 1 ప్రి.

4 డి—సకలాధికర్తా, ఇస్రాయేల్ కుటుంబము యొక్క దివ్యపరిపాలకులా, దేవర వారు మోసేస్ మునికి ముండ్లపొద అగ్నిజ్వాలలో కనిపించి, శీనై పర్వతముమీద వారికి మీ వేదమును పాలించ నవ ధరించితిరే, మీ తిరుకరవల్లభముతో మమ్మును రక్షింప వేంచేయ నవధరించండి స్వామీ ... 1 ప్రి.

5.—సకల ప్రజలకు అడియాలమైన ఏసేయొక్క మూలికా, మీ దివ్యసన్నిధానములో ఆచారనిమిత్త ముగా జనులు మౌనముగా మిమ్ము ప్రార్థించుదురని చెప్పబడినదే, తామసము లేక మమ్మును రక్షింప

వేంచేయ నవధరించండి స్వామీ ... 1 ప్రి,

6 డి.—దావీదు రాజుయొక్క తాళపుచెవీ, ఇస్రాయేల్ ఇంటియొక్క రాజదండమా, దేవరవారు బిగించినదానిని ఇంకొకడు తెరవనున్ను దేవరవారు తెరచినదానిని ఇంకొకడు బిగించనున్ను కూడదు గదా? చెరసాలయందును, అంధకారమునందును, మరణపీడయందును కట్టబడినవానిని విడిపించ వేంచేయ నవధరించండి స్వామీ ... 1 ప్రి.

7 డి.—తూర్పున ఉదయించిన ఆదిత్యుడా, నిత్యప్రకాశముయొక్క కిరణమా, నీతియొక్కసూర్యుడా, అంధకారమునందును మరణపీడయందును వసించువారలను ప్రకాశింపజేయ వేంచేయ నవధరించండి స్వామీ.... ... 1 ప్రి.

8 డి.—జనులయొక్క రాజా, వారలచేత ఆశించబడినవారా, దేవరవారు మూలరాయియై, రెండు గోడలను ఒకటిగా చేసితిరే, మంటిచేత దేవరవారు కలిగించిన మనుష్యులను రక్షింప వేంచేయ నవధరించండి స్వామీ ... 1 ప్రి.

9 డి.—మా కర్తయును దేవుడునైన ఎమ్మానువేలా, మా, రాజా, మా, బోధకులా, జనుల నమ్మకమా, వారల రక్షాధికారులా, మమ్మును రక్షింప వేంచేయ నవధరించండి స్వామీ ... 1 ప్రి,

(ఒ) మేము జేసుక్రీస్తునాథుని తిరువాగ్దత్తములకు పాత్రులమగునట్టు

(౭౦) అర్చ్య-దేవమాతా మా కొరకు వేడు కొనండి.

## ప్రార్థించుదము.

అనంత దయగల సర్వేశ్వరా, దేవరవారు మనుష్యుల రక్షణముకొరకు మీ తిరుసుతుని ఈ లోకమునకు అంపించి, వారుతొమ్మిది మాసములు, అర్చ్య-కన్యమరియమ్మగారి తిరుఉదరములో వాసముచేయ చిత్తమైతిరే, ఆమె గర్భవాసమునకు స్తోత్రముగా మేము చెల్లించెడు ఈ నవదినస్తోత్రజపములను కరుణాకటాక్షముతో చేకొని వారి పుణ్యఫలములచేత మా రక్షణముయొక్క ఫలమును మేము పొంది సదాకాలము అనుభవించ కృపచేయువలయునని మిమ్ము ప్రార్థించు చున్నాము.

ఆమెన్ జేసు.

---

## బాలజేసు ప్రార్థన

---

స్వామీకృపగా నుండండి...(మొదలగునది)

నిత్యపితయొక్క తిరుకుమారుడైన దివ్య బాలుడా,

కన్య మరియమ్మయొక్క కుమారుడైన దివ్యబాలుడా,

మనుష్యుడుగా అవతరించిన దేవకుమారుడైన దివ్యబాలుడా,

మీ దేవపితయొక్క జ్ఞానముగానున్న దివ్యబాలుడా,

మీ మాతయొక్క పవిత్రమైన దివ్యబాలుడా,
మీ పరమపిత ఛాయగానున్న దివ్యబాలుడా,
మీ మాతను సృష్టించినవారైన దివ్యబాలుడా,
మీ పిత ప్రకాశముగానున్న దివ్యబాలుడా,
మీ మాత మహిమయైన దివ్యబాలుడా,
మీ దేవపితకు సరిసమానముగానున్న దివ్యబాలుడా,
మీ మాతకు క్రిందుపడినవారైన దివ్యబాలుడా,
మీ పరమపిత సంతోషముగానున్న దివ్యబాలుడా,

మీ మాతకు బాక్యసముగానున్న దివ్యబాలుడా,

మీ పిత వరముగానున్న దివ్యబాలుడా,
మీ మాతయొక్క కానుకయైన దివ్యబాలుడా,
స్పిరితుసాంక్తువల్ల ఉద్భవమైన దివ్యబాలుడా,
నిజమైన మనుష్యుడును నిజమైన దేవుడునైన దివ్యబాలుడా,

మమ్ము కరుణించుము.

పాపాత్ములైయున మనుష్యులను రక్షించ
పాపివేషమెత్తు కొనిన దివ్యబాలుడా,

ఆర్చ్య-ఎలిశబేత్తమ్మగారి గర్భములోనున్న
స్నాపక అరుళప్పగారిని శుద్ధీకరించినదివ్యబాలుడా,

ఆర్చ్య-కన్యమరియమ్మగారి గర్భములో
తొమ్మిదిమాసములు వాసమైయుండిన దివ్య
బాలుడా,

కన్యమహిమ చెడని యామఃఫలమైన దివ్య
బాలుడా,

పశువులకొట్టములో పుట్టి పశువులగాటిలో
పరుండబెట్టబడి చింపిరి గుడ్డలతో కప్పబడినదివ్య
బాలుడా,

మనుష్యుల పాపములనిమిత్తము గాటిలో
ఏడ్చుచుండిన దివ్యబాలుడా,

బలహీనములో సర్వవల్లభముగలవారైన
దివ్యబాలుడా,

తాళిమియందు మహిమగల దివ్యబాలుడా,

సత్ప్రసాదముయొక్క బొక్కసమైన దివ్య
బాలుడా,

పరిశుద్ధస్నేహముయొక్క ఊటమైన దివ్య
బాలుడా,

మీపరిశుద్ధమాతవల్లను విరక్తులైన జోజప్ప
గారివల్లను అత్యంతభక్తివందనముతో నమస్క
రించబడిన దివ్యబాలుడా,

పుట్టినప్పోడే సన్మనస్కులచేత ఎరిగించబడను
ఆరాంధించనుబడిన దివ్యబాలుడా,

బీదగొల్లవారలకు మిమ్ము ఎరిగించిన దివ్య
బాలుడా,

సన్మనస్కులకును మనుష్యులకును కర్తయైన
దివ్యబాలుడా,

మనుష్యస్వభావమెత్తినందున మాకుసహో
దరుడైన దివ్యబాలుడా,

పితయైన సర్వేశ్వరునికిని మనుష్యులకును
సమాధానము కలిగించ జన్మించిన దివ్యబాలుడా,

దరిద్రములో పుట్టి లోకభాగ్యములను విసర్జిం
చిన దివ్యబాలుడా,

దీనత్వములో జన్మించి లోకఆడంబర బహు
మానములన్నిటిని త్రోసివేసిన దివ్యబాలుడా,

కష్టదశలో జన్మించి సుఖమును ఆరోచించిన
దివ్యబాలుడా,

వృత్తఛేదనములో మాకొరకు ప్రేమతో రక్త
ము చిందిన దివ్యబాలుడా,

తూర్పున కనిపించిన క్రొత్తనక్షత్రముచేత
మిమ్ము ఎరిగించినవారైన దివ్యబాలుడా,

ముగ్గురు రాజులుమిమ్ము ఆరాధించవచ్చుటకై
వారలకు భక్తినిన్ని ధైర్యమునున్ను ప్రేరేపించిన
దివ్యబాలుడా,

మాకు దయచేసి రక్షించండి స్వామీ.

ముగ్గురు రాజులు బంగారు, ధూపము మిర్రా యనెడు మూడువిధముల కానుకలనుసమర్పించి ఆరాధించబడిన దివ్యబాలుడా,

బంగారుచేత రాజనియు, ధూపముచేత దేవుడనియు, మిర్రాయనెడు పరిమళముచేతమనుష్యుడనియు శూచించబడిన దివ్యబాలుడా,

మీతల్లిచేత గుడిలో కానుకగా ఒప్పగించబడి విడిపించుకోబడిన దివ్యబాలుడా,

మిమ్మును తనకరములలో నెత్తుకొనిన మహాత్ముడైన శిమియోనుని యుల్లమునుసంతోషముతో నింపినదివ్యబాలుడా,

దీర్ఘదర్శినియైన అన్నమ్మగారిచేతపొగడనున్న రక్షకుడని జూదులకు ఎరిగించనున్న బడిన దివ్య బాలుడా,

హేరోదు రాజుయొక్క క్రూర ద్వేషమునకు తప్పించుకొన యేజిప్తుదేశమునకు కొనిపోబడిన దివ్యబాలుడా,

హేరోదుని క్రూరత్వముచేత చంపబడిన పసిబిడ్డలకు రక్షణముగానుండిన దివ్యబాలుడా,

ఎజిప్తుదేశములో ప్రవేశించినపుడే పిశాచివిగ్రహములను క్రిందపడగొట్టి నానావిధఅద్భుతములనుచేసిన దివ్యబాలుడా,

ఎజిప్తుదేశములో ఏడుసంవత్సరములపరియంతము పరదేశిగా తిరిగినదివ్య బాలుడా,

మీ దేవ పిత చిత్తమునకు ప్రేమతో క్రిందుపడి ఎజి ప్తు నుండి నజరేతుకు వచ్చిన దివ్యబాలుడా

పరమపిత యొక్క కట్టడలను ఆశ్చర్యమునకు తగిన విధముగా అనుసరించిన దివ్యబాలుడా,

మీ దేవపిత స్తోత్ర ఊడిగమునకై మీ ప్రియ తల్లికిని అర్చ్య-జోజప్పగారికిని మరుగుగా జెరుస లేములో మూడునాళ్ళు నిలిచిన దివ్యబాలుడా,

అందరు అతిశయించునట్టు శాస్త్రులకు వేద సత్యములను తేటపరచుచుండునప్పుడు మూడ వనాడు వారలమధ్య దేవాలయములో తల్లి దండ్రికి కనుపడిన దివ్యబాలుడా,

తల్లిదండ్రులకు తాళ్మితో క్రిందుపడియుండిన దివ్యబాలుడా,

లోకజనులు మిగుల ఆశతో ఎదురు చూచు చుండిన దివ్యబాలుడా,

బాలురకు సుమాతృకగానుండిన దివ్యబాలుడా,

సన్మనస్కులకు తెలగాచున్న దివ్యబాలుడా,

సకల అర్చ్యశిష్టవారలకు మొదటిఫలముగా నున్న దివ్యబాలుడా,

దయాకరులై యుండి...మా పాపములను ఓ ర్వండి స్వామీ,

దయాపరులై యుండి...మా ప్రార్థన విన నవ ధరించండి స్వామీ,

మాకు దయచేసి రక్షించండి స్వామీ.

* ఆదామనువాని బిడ్డల నిర్భాగ్యస్థితినుండి
పిశాచిదాసత్వమునుండి
లోక అపాయములలోనుండి
మోహాగ్ని నుండి
అహంకార గంభీరమునుండి
బుద్ధి అంధకారమునుండి
దుర్మననునుండి
సకలపాపములనుండి
దేవరవారి పరిశుద్ధ ఉద్భవమును జూచి
దేవరవారి తాత్కిజన్మమును జూచి
దేవరవారు చిందిన కన్నీళ్లను జూచి
దేవరవారి వృత్తచ్ఛేదనముయొక్క వేదనను జూచి,
దేవరవారు ముగ్గురు రాజులకు మిమ్ముఎరిగించిన దయను జూచి,
దేవరవారు దేవాలయములో కానుకయైన భక్తి వందనమును జూచి,
దేవరవారి ఆశ్చర్యమైన తగ్గుదలను జూచి,
దేవరవారు అనుభవించిన దరిద్రమును జూచి
దేవరవారు అనుభవించిన కస్తిని జూచి,
దేవరవారు మనుష పుత్రులకొరకు మరణము పొంద ఆశించిన ఆపేక్షను జూచి,
దేవరవారు ఈ లోకములో చేసిన పరిశుద్ధ

* పుష్ప గుచ్ఛము చేర్చి.

సంచారములను సంభాషణలనున్ను జూచి,

దేవరవారి భక్తి నిండిన జపధ్యానములను జూచి,

దేవరవారు పెద్దలయెడ కనుపరచిన వందనములను జూచి,

మిమ్ము పెంచిన తండ్రియైన జోజప్పగారికిని దేవరవారు చేసిన కష్టపనులను జూచి,

దేవరవారి దివ్య బాలత్వమును జూచి,

లోకముయొక్క పాపములను పరిహరించెడు సర్వేశ్వరునియొక్క దివ్య గొఱ్ఱెపిల్లయైన జేసువా (మొదలగునవి)

ప్రార్థించెదము.

దివ్యబాలుడైన జేసువా ... ...
మమ్మును రక్షించి ఆశీర్వదించండి.

## ప్రార్థించేది

మా ఏలినవారును రక్షకులునైన జేసువా! దేవరవారు పసిబాలుడుగా జన్మించి మీ దైవీకమునున్ను మీ కీర్తిన మనుష్యత్వమునున్ను అంత చిన్నప్రాయములో తగ్గించ చిత్తమైతిరే, మీకే స్తోత్రము కలుగునుగాక. మీ బాలత్వములో మీకుగల దివ్యజ్ఞానమునున్ను, బలహీనములో వల్లభమునున్ను తాళ్మిలో మహిమనున్ను మేము ఎరిగి, ఈ భూలోకములో తగ్గించబడినవారైన మిమ్మును ఆరాధించిన

పిమ్మట, మోక్షములో మీరుపొందియుండు మహిమ ప్రతాపమును దర్శింపనున్న నిత్య సేవింపమును అను భవించనున్న కృపజేయనవధరింపుము. ఆమెన్ జేసు.

(అగమునశాలకు పాట)

---

# 2 వ-ప్రసంగము.

(దివ్యబాలుడు ఒక కన్యాస్త్రీ యొద్దనుండి పుట్టిన కారణము.)

దివ్యబాలుడైన జేసునాథుడు, పరిశుద్ధకన్యాస్త్రీనుండి పుట్టిరి. ఈ అతిశయజన్మము దివ్యబాలుని యందు మాత్రమేగాని, లోక ఆరంభమునుండి లోక అంత్యమువరకు ఇంక ఎవరియొద్దను కనుపడునది లేదు. ఈ దివ్యబాలుడు జన్మించిన తల్లియొద్ద సకలపుణ్యములును ఉత్తమవిధముగా కూడియున్న వనుటకు సందేహము లేదు. అటువంటి పుణ్యములు తక్కిన బిడ్డలను కనే తల్లులయొద్ద లేకపోయినను కొంతమంది బిడ్డలతల్లులవద్ద దేవస్నేహము సాక్షి ఎంతయుండును? కన్యత్వవిషయములో ఆలాగు తలంచకూడదు. ఎందుకంటే, ఆఅతిశయము ఈదివ్యబాలుని తల్లియొద్దనేగాని తక్కినతల్లులయొద్ద బొత్తిగా ఉండనేరదు. బిడ్డలను కనేతల్లి కన్యాస్త్రీగా ఉండకూడదు. దివ్యబాలునికి విరక్తత్వమనే పుణ్యము మిగుల ప్రియముగా నున్నందుచేత, తనతల్లిన్ని కన్యాస్త్రీగానుండ

అద్భుతముచేసిరి. ఈ అతిశయముఖాంతరముగా దివ్యబాలుడు స్తోత్రముచేయబడ పాత్రముగా నుండు టయేగాక, ఈ దివ్యబాలుడు కన్యత్వముమీద మహా ప్రియముగా నున్నారని ప్రతిమనిషి దృఢముగా విశ్వసించవలసినది. ఈ లాగు ఒక్కొకరు ఈ దివ్య బాలునికి ప్రియముగా నుండ తనయొద్ద విరక్తత్వ మనే పుణ్యము ఉండేటట్లు ప్రయాసపడవలయును. అటువంటి మంచి మనసు మీకు వచ్చేటట్లు ఇప్పుడు చెప్పబోవుదానిని వినండి.

అలంకారము మనుష్యులకంటికి ప్రియముగా ఉండి నను అలంకారము గల వారలయొద్ద విరక్తత్వము లేనట్టయితే, ఆ అలంకారము ఈ దివ్యబాలుని దృష్టికి ప్రియముగా నుండదు. అవలక్షణము మనుష్యుల కం టికి సరిపడకపోయినను, అవలక్షణముగలవానికి విర క్తత్వము ఉండినట్లయితే, అది ఈ దివ్యబాలునికి ప్రియముగా నుండును. మనుష్యులు అలంకారము మీద ఉంచియుండు పక్షమునకంటె, ఈ దివ్యబా లుడు విరక్తత్వముమీద అధికపక్షముంచియున్నారు. మనుష్యులు అవలక్షణముమీద ఉంచిన అరోచకము నకంటె, విరక్తత్వమునకు విరోధమైన కార్యములను ఈ దివ్యబాలుడు అధికముగా అరోచించుచున్నారు. ఇట్లుండగా, విరక్తత్వమునకు విరోధమైన కార్యముల లో మనుష్యులు అపేక్ష కలిగి యుండునది ఏలాగు ? ఈ విషయములో మీకు మంచి బుద్ధి కలిగేటట్టు

ఇప్పుడు చెప్పబోవుదానిని వినండి. ముందుకాలములో సంభవించిన జలప్రళయములో పాతివ్రత్యముగల నోయుని నిన్ని, వానికుటంబము ఎనిమిదిమందిని తప్ప ఆ కాలములో, లోక ముందున్న సకల మనుష్యుల నున్ను సర్వేశ్వరుడు నాశనము చేసిరి. ఇది గొప్ప శిక్షకదా? దానికి తరువాత సోదోం గొమోర అనెడు ఐదు పట్టణములమీద కురిసిన నిప్పులవర్షముచేత లోత్తుడుతప్ప, ఆ పట్టణములును పట్టణవాసులును బూడిద యై పోయిరి. ఇదిన్ని గొప్ప శిక్షయేగదా? మోహాపాపమువల్లనేగదా, సర్వేశ్వరుడు ఈ రెండు గొప్పదండనలను విధించిరి. అట్లుండగా దీని నెరిగిన మనుష్యులు మోహాపాపముమీద ఆశపెట్టవచ్చునా?

మరియు ఈ దివ్యబాలుని కనినతల్లి కన్యాస్త్రీగా నుండిరని చెప్పితిమే. దీనిలోగల అతిశయములను వినండి. ఈ దివ్యబాలుడు తమతల్లియొద్దచేసిన అద్భుతముచేత, ఆ దివ్యతల్లి దివ్యబాలుని కనుటకు ముందున్ను కనేటప్పుడున్ను, కనినతరువాతనున్ను కన్యాస్త్రీగానే యుండిరి. ఇటువంటి అశ్చర్యములను చేసిన ఈ దివ్యబాలుని సమస్తులు కొనియాడ వారు పాత్రమై యుండుటయేగాక, విరక్తత్వముమీద వారు అత్యంత పక్షముగా నున్నారని నిశ్చయించవలసినది. దీనిని వినేవారలారా, మీరు ఆ దివ్యబాలునికి ప్రియపడేటట్టుగా, మీ యొద్ద విరక్తత్వమనే పుణ్యము ఉండునట్టు చేయండి. అంతరేంద్రియముల, పంచేంద్రి

యములద్వారా దానికి మోసము రాకుండునట్లు ఎచ్చరిక యైన కావుదల చేయండి. మీ మనసు, బుద్ధి కనుదృష్టి, వినడము, మాట్లాడడము, నవ్వులు, ఆట లు, చేష్టలు, ఇవ్వడము, తీసుకొనడము వీటిలో విర క్తత్వమనే వాసనను అంతట అందరికి పరిమళించే టట్టు అందులో మోహామనే అశుద్ధము పడకుండా జాగ్రతగా చూచుకొవలసినది.

కడసారి వేడుకొవలసినది: నా హృదయములోకి వేంచేసి రాను ఆశగల దివ్యబాలుడా! విరక్తత్వము దేవరవారికి ముందడుగుగా నుండ దేవరవారు కృప చేయవలయునని మీ తల్లిగారి కన్యత్వమునుగూర్చి మిమ్ము ప్రార్థించుచున్నాను. ఆమేన్ జేసు.

దివ్యబాలునినిన్ని, కన్యతల్లినిన్ని అర్చ్య-జోజప్ప గారినిన్ని గురించి 1జో. 1ప్రి. 1త్రి. వేడుకొనేది.

(5 పుటనుండి 16 పుటవరకు గల జపప్రార్థన చెప్పవలెను.)

---

## 3 వ-ప్రసంగము

(జ్ఞానసూర్యుడైన దివ్యబాలుడు మనహృదయములలో ఉదయించునట్లు ఆశపడుటనుగూర్చి.)

దివ్యబాలుడైన జేసునాథుడు మానవుల రక్షణము నిమిత్తము ఎప్పుడు ఉద్భవించుదురోయని ఇస్రాయేల్ జనము మహాఆశతో ఎదురు చూచుచుండిరి. అదిఏలా

గనగా, లోకమును రక్షించేవారు ఇకమీదట పుట్ట బోయెదరని శృంగారవనములో ఆదితల్లి దండ్రులకును అబ్రహామనేవారికిని వేరు కొందరు మహాత్ములకును సర్వేశ్వరుడు వాగ్దత్తమిచ్చియున్నందున అటువంటి భాగ్యమైనకాలము ఎప్పుడు వచ్చునోయని ఇస్రాయేల్ జనము ఆశించుకొని యుండిరి. విశేషముగా దావీదు రాజుయొద్దను, తక్కిన దీర్ఘదర్శులయొద్దను ఆ ఆశ అధికరించియుండినది. లోకమును రక్షించెడు ఇటువంటి దివ్యబాలుడు అవతారమగుటకు అయిదు వేల చిల్లర సంవత్సరములు గడచినవి. ఇంతకాలపు ఆలస్యమును ఎబ్రేయజనులు చూచి రక్షకుడు శీఘ్రము వేంచేసి వచ్చునటుల ఎడతెగకుండా వేడుకొని వచ్చిరి. దీనిని వినెడు వారలారా, స్వామిసన్ముఖ ములో మీరు అడిగెడు మనవి వారు దయచేయు ఆలస్యముచేసినను అంతటితో విసికి మీప్రార్థనవిడిచి పెట్టకుండా, ఆమనవి ఎప్పుడు దయచేయుదురోయని ఆశతో కాచుకొనియుండండి. మీ ఆశకును వేడుదల కును నమ్మకమునకును తగినట్టు అడిగిన మనవిని సర్వే శ్వరుడు శీఘ్రముగా దయచేయును.

మరియు అటువంటి దివ్యబాలుడు జన్మించ ఇస్రాయేల్ జనులయొద్ద ఆశయుండినదిగాక పితామిత్రుడైన జాకోబు చెప్పిన ప్రకారమే, ఈ ఆశ యితరజనుల యొద్దకూడ ఉండినది. ఇందుకు దృష్టాంతమేమనగా, లోకమును రక్షించేవారు వచ్చినతోడనే పుట్టినవారు

ఇట్టివారని ఎరిగి వారిని ఆరాధించి మిగుల స్నేహించి తమనమ్మకమునంతటిని వారిమీద నుంచడమగును. అటువంటిదివ్యబాలుడు సకలమనుష్యుల భాగ్యమై నందున ముందుచెప్పబడిన ఆశకలిగియుండునది న్యాయమేసరి. ఈదివ్యబాలుడు పుట్టుటకుముందే పాపాంధకారము లోకములో నిండియుండినదిన్ని, పిశాచ ఆరాధన ప్రబలియుండినదిన్ని సరియే. ముందు చెప్పబడిన జ్ఞానసూర్యుడు ఉదయమైనవెనుక జ్ఞానప్రకాశము అంతటావ్యాపించినది. రెండుమూడు రోజులు మాత్రము సూర్యుడు ఉదయించక పోయినట్టయితే సూర్యుడు ఎప్పుడు కనుపడునోయని అందరికి ఆశగానుండును. దీనికంటే జ్ఞానసూర్యుడైన జేసునాథుడు ఉదయించ అందరు ఆశకలిగియుండుట న్యాయమే కదా? వాడిపోయిన పైరులకు వానకురువ వలయునని అందరు ఆశతో కాచుకొనియుందురుగదా? ఆ ప్రకారముగా ముందు చెప్పిన కార్యములో యోచించవలసినది. రాజ్యమును ఏలేరాజుకు పట్టపుకుమారుడు పుట్టవలయునని ప్రజలు ఎంత ఆశగానుందురు. అటువంటి కుమారుడు కొన్నిమాసములు నష్టముగా యుండినట్టయితే హానిమూలముగ రాజ్యమునకు కీడు తటస్థించుటయేగాక మేలుకలుగదు. దివ్యబాలుడు పుట్ట లోకమునకు అవసరమే కదా? వారు పుట్టిన తరువాతలోకమునకువచ్చిన మేలులు ఎరిగియున్నాము. ఇందుచేత అటువంటి దేవబాలుడు పుట్టిన ఉపకార

మునకై తగినస్తోత్రము చెల్లించి వారినిస్నేహించవలసినది.

ఇదియునుగాక సూర్యుడు ఉదయించిన పిమ్మట వదొకడు ఇంటివాకిలిని మూసియుంచినట్టయితే వెలుతురు లోనికిరాక చీకటిగానుండును. ఈ కొరతవాని చేతకలుగుచున్నదేగాని, సూర్యునినుంచి కలుగుట లేదు. ఇంటివాకిలిని తెరచిపెట్టినట్టయితే చీకటి తొలగిపోవును. ఈసంగతి వినేవారలారా, ఈదివ్యబాలుడు పుట్టియుండినను వారివరప్రసాదములు మీహృదయములోకి రాను మీహృదయములను విశాలముగా తెరచియుంచవలసినది. మీపాపముచేత హృదయవాకిలిని మూసివేసినట్టయితే, మనసులో పాపాంధకారము క్రమ్ముకొనియుండును. ఇటువంటి చీకటి మీలో అనేకమందియొద్ద మూసుకొనియుండలేదా? అటువంటి గొప్పకొరత వారల వారలనుంచి వచ్చుచున్నదేగాని, దేవబాలునినుంచి రావడములేదు. ఎండిపోయెడు పైరుకు నీళ్ళుపారించ సేద్యగాడు చెరువునుండి కాలువత్రవ్వ ప్రయాసపడుచున్నాడుగదా? ఆప్రకారముగానే ముందుచెప్పిన కార్యములో యోచించవలసినది. ఇందుకు అర్థమేదనగా, మంచి పాపసంకీర్తనము చేసేటట్టు కావలసిన ప్రయత్నమంతటిని చక్కగాచేసి మంచి పాపసంకీర్తనము చేసినట్టయితే ఆత్మములో దేవవరప్రసాదము రాను జ్ఞానకాలువ త్రవ్వినట్టగుచున్నది. మరియు ఇప్పుడు రాబోవుచున్న

రక్షకుడు పుట్టినపండుగలో, దివ్యసత్ప్రసాదము తీయ ఆశగానుండే మీరు ఆకాలములో పుట్టిన జేసునాథుడే దివ్యసత్ప్రసాదములో వేంచేసి యున్నారనియు వారు నీహృదయములో జ్ఞానవిధముగా పుట్టుచున్నారనియు వారు నీహృదయములో వేంచేసి వచ్చినందుచేత నీకు మహాభాగ్యము లభించుచున్నదనియు తలంచి స్వామి పుట్టిన పండుగరోజున దివ్యసత్ప్రసాదము తీసేటట్టు ఇప్పటినుండి మీరు మంచి ఆయత్తము చేయ ఆశగా నుండవలెను. ఆశతో భోంచేసినట్టయితే శరీరమునకు బలముకలుగును. బలవంతముచేతనైనను అయిష్టముతోనైనను భోంచేసినట్టయితే అది బాగా వంటబట్టదు. ఆవిధముగానే జ్ఞానభోజనమైన సత్ప్రసాదము తీయుటలోను యోచించవలసినది.

కడసారి వేడుకోవలసినది. దివ్యబాలుడైన నా జేసునాథుడా! లోకరక్షణమైన పరిపూర్ణ భాగ్యమునకు దేవరవారు పుట్టినందుచేత, దేవరవారికి వేయి పదివేలమారులు స్తోత్రము చేయుచున్నాను. అయితే ఆ భాగ్యములో నాకు రావలసిన భాగమును నా పాపముచేత పోగొట్టుకొనకుండా నన్ను కాపాడి రక్షించండి. అందుకు నేను పాలివాడనైయుండ దేవరవారు దయచేయ మీ తల్లిగారును, అర్చ్యజోజప్పగారును దేవజన్మముమీద ఉంచిన ఆశనుగురించి మిమ్ము ప్రార్థించుచున్నాను. ఆమెన్ జేసు.

దివ్యబాలునినిన్ని, తిరుతల్లి నిన్ని, అర్చ్య జోజప్ప గారినిన్ని గురించి 1జో. 1ప్రి. 1త్రి. చెప్పవలె.

(5 పుటనుండి 16 పుటవరకు గల జపప్రార్థనను జెప్పేది.)

---

## 4 వ-ప్రసంగము

(మనుష్యావతారము చేత మనుష్యులకు లభించిన మేలులు.)

దివ్యబాలుడైన జేసునాధుడు మనుష్యులకు చేసిన ఉపకారము మహా హెచ్చైనదిగా నున్నది. సుతుడైన సర్వేశ్వరుడు మనుష్యుడై పుట్టినందుచేత, మనుష్యునికి వారుచేసిన ఉపకారమంతా వర్ణించకూడక పోయినను, ఈ ప్రసంగములోను, ఇక చెప్పబోవు ప్రసంగములలోను ఏమాత్రమైనా చెప్పి చూపుదుము. అటువంటి ఏలినవారు మనుష్యస్వభావమును ఎత్తినందు చేత, సకల మనుష్యులును వారికి సహోదరులైరి. ఇందుచేత అపోస్తులైన అర్చ్య-చిన్నప్పగారు వ్రాసిన లాగు జేసునాధుడు మనుష్యులను సహోదరులని పిలువ సంకోజపడినవారు కారు. ఈ మూఖాంతరముగా మనుష్యులకు ఎంత గౌరవము కలిగినది. ఇది మిగుల ఉపకారమేగదా? దీనిని ఏమాత్రమయినను కనిపట్టేటట్టు ఇప్పుడు చెప్పబోవు దానినిగమనించండి.

అర్చ్య-తదేయువనువారు మహాత్ములును అపోస్తులైన అర్చ్య రాయప్పగారికి తమ్ముడుగా నుండు

నది తమకు మిగుల గౌరవమని తలంచిరి. దీనికంటే యేసునాథునితమ్ముడుగా నుండునది ఎంత గొప్ప గౌరవము? సన్మనస్కులస్వభావము మనుష్యులస్వభావమునకంటె గొప్పదిగా నుండినను, వారలు ముందు చెప్పబడిన గౌరవమును పొందియుండలేదు. యేసునాథుడు సన్మనస్కులను తమసహోదరులని పిలువలేదు. సుతుడైన సర్వేశ్వరుడు సన్మనస్కులనున్ను మనుష్యులనున్ను కలిగించినందుచేత, వారలకును వీరలకును ఏలినవారుగా నుండునది యదార్థమే. వారు మనుష్యుడుగా పుట్టినందుచేత మనుష్యులకు సహోదరులైరి. ఈ విషయమై కలిగిన కడుపుమంట చేతగదా లూసిఫేరు అహంకరించి చెడిపోయినది. పై చెప్పిన దేవునియొక్క నరజన్మమును ఎంచని క్రీస్తువులు ఎంతోమంది. అంత మహిమగల జన్మమునకు తమ పాపముచేత మానభంగము రప్పించుచున్నారు. క్రీస్తువులారా! మీకు వచ్చిన ఈజన్మముయొక్క పట్టపు అడియాలమును కనిపట్టి దానికి యోగ్యమైన నడత మీయొద్ద పెరుగజేయండి. అజ్ఞానులకుకూడా ఈ పట్టము వచ్చియుండినను మీవలె వారలు దానిని కనిపట్టలేదు.

మరియు ఇప్పుడు చెప్పబడిన జన్మముగుండా, మనుష్యులకు బహుమేలులువచ్చినవి. ఆ జన్మముఖాంతరముగా, సుతుడైన సర్వేశ్వరుడు మనుష్యులతో సంచరించిరి. అంతకుముందు సర్వేశ్వరుడు సన్మన

స్కులమూలముగా మనుష్యులతో మాట్లాడుదురు. ఈ జన్మమునకు తరువాత, వారు తామేమిగుల పక్షముతో మనుష్యులయొద్ద మాట్లాడిరి. ఈ జన్మ ముఖాంతరముగా గొల్లవారలును, ముగ్గురు రాజులును, దేవబాలుని సంధించిరి. వయసుచెల్లిన అర్చ్య-శిమియోను తమ చేతులతో దివ్యబాలుని ఎత్తుకొనిరి. రక్షకుడు ముప్పదిమూడు సంవత్సరములు ఈ భూలోకములో ఉండిరి. అన్నదమ్ములు తమలో ఒద్దికగానున్నట్టు జేసునాధుడు తమ శిష్యులతో సంచరించిరి. పాపాత్ములకు మాత్రమే విశేష పక్షమును చూపించిరి. పాపాత్మురాలుగానున్న మరియ మగ్దలేనమ్మ మాత్రమే తమ దివ్యపాదములు కడుగను, ముద్దుచేయను సమ్మతించిరి. కష్ఠి యనుభవించే మనుష్యుల మీద బహుకనికరముంచిరి. చనిపోయిన లాజరుని గూర్చిన్ని, జెరుసలేం పట్టణమునకు రాబొయ్యేడు అనర్థమునుగూర్చిన్ని కనికరముచేత కన్నీళ్లురాల్చిరి. తమయొద్దకు ఎంతమంది వ్యాధిగ్రస్తులువచ్చిరో, అంతమందికిని ఆరోగ్యము పాలించిరి. ముందుచెప్పబడిన జన్మముఖాంతరముగా, పితయైన సర్వేశ్వరుడు మనుష్యులకు తండ్రిగానున్నారు. జేసునాధుడు పరమండలములో మనుష్యులకొరకు మనవిచేయువారుగా పితయొద్దనున్నారు. దేవమాత మనుష్యులకు తల్లియైనది. సన్మనస్కులు విశేష పక్షపరామర్శకతో మనుష్యులను పిచారించుచున్నారు. ఆ జన్మముచేత రక్షకుడు

దివ్యసత్ప్రసాదమును కలిగించిరి. వారు భూలోకము లోనుండునపుడు సమస్తులకు మేలుదయచేసినట్టుగానే లోకములోని మనుష్యుల ఆత్మ శరీరములకు మేలు దయచేయునట్లు, వారు ఎప్పుడున్ను దివ్యసత్ప్రసాద ములో వేంచేసియున్నారు.

హెచ్చయిన జాతిగలవానికి నీచకులమువాని గుణ ముండునా? ముందు చెప్పబడిన జన్మమూలముగా హెచ్చయినజాతిగల నీవు, పాపబురదలో పందివలె పొ ర్లాడునది తగునా? అట్లయితే నీవే ఆ జాతికి వెలిగా త్రోయబడు మార్గమును ఏర్పరచుకొనుచున్నావు. ఇదియునుగాక, ఈ జన్మమూలముగావచ్చెడు మేలు లన్ని, నీవు గైకొనవలసినది. జేసునాథుడు భూలోక ములో సంచరించెడు దినములలో నీవు ప్రాణముతో నుండినట్టయితే, నీ ఆత్మకును శరీరమునకును కావల సిన మేలులకు ఈ జన్మముగుండా నమ్మికముతో వారి యొద్దకుపోయి అడుగుదువుగదా? ఆ ప్రకారముగా ఇపుడు నీకు కావలసినదంతా దివ్యసత్ప్రసాదములో వేంచేసియుండు జేసునాథునియొద్ద నమ్మికముతో అడు గవలసినది. నీకువచ్చిన చెరుపుతొలగి పొయ్యేటట్టు రాజుయొద్ద ప్రధానిగానుండే నీ సహోదరుని నమ్మి వాని శరణుజొచ్చుదువుగదా? ఆవిధముగా నీ అవసర మునకు తగినది అడుగ నీవు దివ్యసత్ప్రసాదములో వేంచేసియుండు జేసునాథుని శరణమునుకోరి పోవల సినది.

కడసారి వేడుకోవలసినది: దివ్యబాలుడా, ఇంత వరకు పిశాచినీచదాసునివలె నేను పాపమార్గములో ప్రవర్తించినదిచూచి సిగ్గుపడుచున్నాను; తెలియక చేసితిని, ఇకమీదట నేను దేవర వారి జన్మమునకు యోగ్యముగా నుండ దేవరవారు సహాయము చేయ కన్యాస్త్రీయైన మీా పరిశుద్ధతల్లి దేవరవారిని ముద్దుచేసి దేవరవారికి మొదటిసారి పాలిచ్చిన.దానిని గూర్చి మిమ్ము ప్రార్థించుచున్నాను ఆమెన్ జేసు.

దివ్య బాలునినిన్ని, దేవరతల్లినిన్ని, అర్చ్య-జోజప్పగారినిన్ని గురించి 1 జో 1 ప్రి 1 త్రి చెప్పూట.

(5 పుటనుండి 16 పుటవరకుగల జపప్రార్థనను చెప్పూట)

---

## 5 వ-ప్ర సంగము.

(జేసునాథుడు అందరికిన్ని సమాధానము కలిగించ పుట్టెరి.)

దివ్యబాలుడైన జేసునాథుడు సమాధానము రప్పించేవారై యున్నారు. అది ఏలాగంటే, దివ్యబాలుడు పుట్టిన తోడనే కనుపడిన సన్మనస్కులు సమాధానముమీాద పాడినలాగు ఆ దివ్యబాలుడు లోకమునకు సమాధానము రాజేసిరి. ఏలాగంటే, ఆదితండ్రి కట్టుకొనిన పాపముచేత, లోకారంభమునుంచి ఈ దివ్యబాలుడు పుట్టేవరకు సర్వేశ్వ

రునికి మనుష్యులు శత్రువులుగాను, కర్తద్రోహులు గాను అయిరి. ఈ దివ్యబాలుడు పుట్టిన పిమ్మట, వీరు ఆద్రోహమును తొలగించి మనుష్యులను సర్వేశ్వరుని తో సమాధానపరచిరి. ఒక దేశములోని జనులు ప్రభువునకు చేసిన ద్రోహము నిమిత్తమై ప్రభువు వారలను అసహ్యించి విరోధించి, వారలను క్రూరముగా దండించుటను అప్రభువు కుమారుడు చూచి ఆదేశస్తులకు వచ్చిన ఆపత్తును తొలగించి, వారలను ప్రభువుతో సమాధాన ఐక్యపరచినట్టయితే, అఘనమైన ఉపకార ముఖాంతరముగా ఆదేశస్తులు ప్రభువు కుమారునికి మేలెరిగిన తనము చూపించవలసినదిగదా? మనుష్యులు కర్తద్రోహులైనందుచేత మనుష్యులకు యెంతచేటుకలిగినది. సమాధానముచేత మనుష్యులు ఎన్ని మేలులు పొందిరి. అటువంటి ఉపకారమును కట్టడచేసిన దివ్యబాలునికి స్తోత్రముచేయ మనుష్యుల మీాద ఎంత అప్పుమోాపియున్నది. ఈ దివ్యబాలుడు ముందుచెప్పబడిన సమాధానము రప్పించినను క్రీస్తువులలోనే ఎంతోమంది, కట్టుకొనెడు చావైన పాపముచేత, కర్తద్రోహులగుచున్నారు. ఈకీడుకు వీారు లోబడకుండా చావైన పాపమును విడిచిపెట్టి దానికి భయపడినడువ వలసినది.

ఇదియునుగాక, ఈ దేవబాలుడు పుట్టుటకుముందే సర్వేశ్వరుని వేదము అనుసరించుచు వచ్చిన ఇస్త్రాయేల్ జనులు, పిశాచిని ఆరాధించెడు ఇతరజాతి జను

లను విషసర్పములవలె అసహ్యించుచు వచ్చిరి. ఇందు చేతవారలకును వీరలకును మహా వైరాగ్యము గలిగి యుండినది. పుట్టిన బాలజేసునాధుడు వీరలను వారలను ఏకీభవింపజేసి, ఒకేమందగా చేసిరి. మరియు వీరుపుట్టుటకుముందు, రాజులు అధికారులు, ద్రవ్యవంతులు, హెచ్చుకులస్థులు, సామాన్యబీదజను లను నిరాకరించి, అసహ్యించుటచేత,వీరలకును వారల కును సమాధానము లేదు. పుట్టిన బాలజేసునాధుడు ఆ శ్రీమంతులకును పేదవారలకును బుద్ధిగలవార లకును, బుద్ధిహీనులకును సమాధానముచేసి అంద రును ఒకశరీరముయొక్క అవయవములుగాను, తా ము దానికి తలగాను ఉండచిత్తమైరి. అటువంటి సమాధానమూలముగా ఇన్ని మేలులు మనుష్యులకు వచ్చినందుచేత అంత సమాధానము రప్పించిన దివ్య బాలుడైన జేసునాధునికి మేలెరిగిన తనము చూపించ వలసినది.

ఇదివరకు క్రీస్తువులలో అనేకమంది ఇప్పుడు చెప్ప బడిన సమాధానప్రకారము నడచినను, కొంతమంది నడవడము లేదు. మీరు వీరలవలె నడవకుండా వార లవలె నడిచేటట్టు ఇపుడు చెప్పుదానిని వినండి. ముందు చెప్పినలాగు అందరును ఒక శరీరముయొక్క అవయ వములుగా నున్నందుచేత, ఒక అవయవము మరియొక అవయవముమీద పక్షముగా వుండులాగు ఒకరి నొకరు ప్రేమించవలసినది విధియాను. వారు వేరేకుల

స్తుడుగాను వేరే అంతస్తువాడుగాను ఉన్నందుచేత వాడును వానికిని ఏమిసంబంధమని కొందరు చెప్పు దురుకాబోలు! అందుకు మేముచెప్పేదు న్యాయ మును వినండి. మీ శరీరములోనుండే కన్ను, కాలు కాదు. కన్ను వేరే అవయవము, కాలు వేరేఅవయవ ము. కంటియొక్క పని చూడడము. కాలుయొక్క పని నడవడము. అట్లుండగా మీకాలిలో ముల్లువిరిగి నపుడు మనసు దానిమీద కనికరపడుచున్నది. కన్ను ఆముల్లు యొక్కడయని చూపుచున్నది. చేయి దానిని పుట్టి తీసివేయ ప్రయాసపడుచున్నది. ఇట్లు ఒకొక అవయవము వేరువేరుగానుండినను అన్ని అవ యవములును ఒక్కశరీరముయొక్క అంగములుగా నున్నందుచేత, కన్ను కాలిమీద పక్షముగానుండి కాలిలో విరిగినముల్లు ఎక్కడనున్నదని అది వెదకి చూపినపిమ్మట, దానిని తీయుటకు చెయ్యి సహాయ పడుచున్నదిగదా? ఈ ఉపమానమును చూచినట్ట యితే ముందు చెప్పబడిన జాతి అంతస్తు వ్యత్యాసము ఊరక చెప్పే సాకుపోకుగాను, అహంకార మాట గాను ఉంటున్నది.

వేరు కొందరు చెప్పునది: అదిగోవాడు నాకు విరో ధముచేసియుండగా వానితో సమాధానమగుట ఏలా గనుదురు. ఇందుకు చెప్పే ఉపమానమును వినండి: మీరు భోంచేయునపుడు నాలుక కొరుకుకుంటే అం దుకు పగతీర్చ పండ్లను పీకివేయవలపినదా? పండ్లు

న్ను, నాలుకయున్ను, ఒకశరీరములో నున్నందుచేత అటువంటిపగ తీర్పడములేదు. ఆప్రకారముగా మీ రున్ను, మీకు కీడుచేసిన వారలును ముందుచెప్ప బడిన శరీరముయొక్క జ్ఞానఅవయవములైనందుచేతః వారలుచేసిన తప్పితములను ఓర్చి సమాధానముగా నుండవలసినది. ముందుచెప్పబడిన ఉపమానములో నాలుకను కరచిన పండ్లను ఊడబెరికినట్టయితే, శరీ రమునకు నొప్పిన్ని, ఖేదమును కలుగుటచేత, దానిని పీకివేయకూడదని చెప్పినట్టయితే ఇప్పుడు చెప్పబోవు దానిని వినండి. మీవిరోధిని పగదీర్చ మీరువానికి కష్టిరప్పించినట్టయితే ఆపాపముచేత మీఆత్మకు మహాకష్టము కలుగుననుటచేత పగదీర్చక ఉండవలసి నది. ముందు చెప్పబడిన శరీరమునకు తలయైన జేసు నాథుడు, మనము ముందుజేసిన తప్పితములను ఓర్చు లాగు వారిని గురించి ఒకొకరును పరులు తమకు చేసిన తప్పిదములను ఓర్చవలపినది.

కడసారి వేడుకోవలసినది: నా మంచి జేసునా! మీ పితతోనును సకల మనుష్యులతోనును నేను సమాధానముగా నుండేటట్టు, నేను పాపమును విడచి సాధుగుణమునుపొంద, దేవరవార సహాయముచేయ దేవరవారు పుట్టినతోడనే మీదివ్య తల్లి దేవరవారికి చేసిన మొదట యూడిగమును గురించి మిమ్ముప్రార్థిం చుచున్నాను.

ఆమెన్ జేసు.

దివ్యబాలునిన్ని, తిరుతల్లినిన్ని, అర్చ్య జోజప్ప గారినిన్ని తలంచి 1 జో 1 ప్రి 1 త్రీ చెప్పుట.
(5 పుటనుండి 16 పుటవరకుగల జపప్రార్థనను చెప్పుట).

## 6 వ-ప్రసంగము.

(దేవసుతుడు మనుష్యులకు మంచిమనసు రప్పించ పుట్టిరి.

దివ్యబాలుడైన జేసునాథుడు మనుష్యులకు మంచి మనసు రప్పించేవారుగా నున్నారు. అది ఏలాగంటే, బాలజేసునాథుడు పుట్టుటకుముందు, భూలోకములో గల మనుష్యుల మనసు రేగులగుట్టగానున్నందున, ముండ్లునిండిన వనాంతరముగా నుండినది. అది ఏలాగంటే, వారలు పిశాచిని ఆరాధించుటచేత, దొంగతనమునందును, పగతీర్చుటయందును, మోహపాపమునందును అనేకులు ప్రవర్తించుచు వచ్చిరి. స్వామి పుట్టినపిమ్మట, వారు మష్యులకు చేసిన సహాయము వల్ల, మనుష్యులమనసు మార్చబడినది. ముందు చెప్పబడిన రేగులగుట్ట సత్సారవంతమైన భూమియైనది. ముండ్లునిండిన వనాంతరము జ్ఞానఫలములు ఫలించు ఉద్యానతోటయైనది. దివ్యబాలుడు కలిగించిన తిరుసభ, జ్ఞానసందావనమువలె నున్నది. ఈతిరుసభలో ఎందరు అర్చ్యశిష్టవారలు, అపోస్తులు, వేదసాక్షులు, విరక్తులు, కన్యాస్త్రీలు గలరని ఎంచెడువార లెవరు ? దేవస్నేహము, పరస్నేహము, సాధుగుణము, తాళ్మి ఈ

తిరుసభలో నుండునది ఎంత! రేగులభూమిలో రోజా, లీలి, మల్లె, మొల్ల ఈ మొదలగు అలంకార సుగంధ పుష్పములు నిండార పూసిన నందనవనముండుటను నీవు చూచినట్లయితే దానిని కలిగించిన వానిని కొనియాడి, పొగడ తలంపువచ్చునే! మనుష్యులమనసు ముందు రేగులగుట్టగా నుండుటయును, ఇప్పుడు జ్ఞాన నందావనముగా మారి యుండుటయును, చూచునపుడు, ఈ అతిశయము కావించిన దివ్యబాలుని, అధిక మధికముగా కొనియాడి స్తుతింపవలసియున్నది, ఇప్పుడు చెప్పబడిన ఆ జ్ఞాననందావనములో ఎన్ని జ్ఞానపుష్పములుండినను, వాటిలో నీవును చేరియుండినను, నీ మనసు జ్ఞానపుష్పములను ఈయక, ముండ్లు మొలవచేసినట్లయితే ప్రయోజనమేమి ? కలుపుతీసి పార వేయవలసినదినము వచ్చినట్లు, ఈ తిరుసభలో చేరియున్న నిన్ను పీకివేసి నరకములో కాల్చివేయు కాలము వచ్చును. ఆలాగు రాకుండునట్లు, దివ్యబాలుడు కలిగించిన తిరుసభలో, నీవు ఫలముపొంద, నీమనసు జ్ఞానపుష్పములైన పుణ్యములను ఫలింప జేయుము.

మరియు ముందు చెప్పబడిన మంచిమనసు మనుష్యులకు వచ్చేటట్లు, ఈ దివ్యబాలుడు అనేకవిధసహాయములను కలిగించిరి. నందావనములో ఎన్ని పుష్పములుండినను, దానికి నీళ్లు పారించకుండాను, ఎరువు వేయకుండాను ఉండినట్లయితే, అవి వాడిపోవును. దానికి

కావలసినది యంతా తక్కువలేకుండా విచారించి నట్టయితే, ఆ వృక్షములు ఎప్పుడును పుష్పించు చుండును. మనుష్యుల మనసు ఎప్పుడును జ్ఞానవృక్ష మాలయిన పుణ్యములను ఇచ్చేటట్టు జ్ఞానఊటగా జేసునాథుడు ఏడు దేవద్రవ్య అనుమానములను యే ర్పరచిరి. వాటిలో విశేషముగా దివ్యసత్ప్రసాదమూ లమున తేలికగా మంచి మనసు రా వచ్చును. జేసు నాథుడు చెప్పిన బుద్ధిమతులును, చూపిన పుణ్య సన్మాత్రుకయును అనేక జ్ఞానపుస్తకములలో నిండి యున్నవి. వాటిని అడుగడుగుకు గురువులును ఉపదే శులును బయలుపరచు చున్నారు. ఈ మూలముగా మనుష్యులకు మంచి మనసు వచ్చును.

పుణ్యాత్ములు చేయు ధర్మబోధవల్లను, బ్రతికియుం డు మహాత్ములయొక్కయును, పరమండలములోనున్న అర్చ్యశిష్టవారలయొక్కయును వేడుదలవల్లను మంచి మనసు వచ్చును. స్వామి సమస్తులకును ఇచ్చేడు మంచి విచారముచేత మంచి మనసు వచ్చును. కాబట్టి మంచిమనసు వచ్చుటకు ఇన్ని మార్గములను తెర చిన దివ్యబాలునికి తగిన స్తోత్రము చెల్లింపవలసినది. అజ్ఞానులు పుణ్యముచేయుటకు సాకు చెప్పినను, తిరు సభలో చేరియుండు క్రీస్తువులు ఆ సాకు చెప్ప ఎడము లేదు. అది ఏలాగంటే, పుణ్యముచేయవలసిన మనసు రాను ఇప్పుడు చెప్పబడిన ఇన్ని మార్గములుండగా, క్రీస్తువునికి అవి యన్ని వాని స్వాధీనములో నుం

దునవ్రుడు ఏమి సాకు చెప్పి తప్పించుకొనకూడును ? ఇందుచేత తోటవాడు పూలచెట్లకు కాలువత్రవ్వి నీళ్లు పారించ ప్రయాసపడురీతిగా, ముందుచెప్పిన కార్యములో యోచించవలసినది. ఇందుకు అర్థ మే మనగా, దేవద్రవ్య అనుమానములమూలముగ,విశేష ముగా దివ్యసత్ప్రసాదమూలముగ మంచి మనసు కలుగుటకు కావలసిన సహాయమువచ్చునే. అటువంటి సహాయము నీవు పొందేటట్టు కావలసిన ఆయత్తము తో దేవద్రవ్యములను గైకొన నీవు ప్రయాసపడవల సినది.

మరియు జేసునాథుడు చెప్పిన బుద్ధిమతులును, చూపిన పుణ్యామాత్రుకయును తలంచి దానిమీద యో చనచేసినట్టయితే, మంచి మనసు వచ్చును. తిరగలిలో మంచి ధాన్యము పోసి విసరినట్టయితే. మంచి పిండి పడినట్టు ముందు చెప్పిన కార్యములోను అగును. ఆయాఅర్చ్యశ్రేష్టవారల మీదను, విశేషముగా వా రల రాజ్ఞమీదను నీవు విశేషభక్తియుంచి, వారలను గురించి విశేషపుణ్యము చేసినట్టయితే, నీకు మంచి మనసురాను వారలు సర్వేశ్వరుని వేడుకొనెదరు. నీవే శరీరజీవనకార్యములలో అనుకూలమగుటకు అడుగడు గుకు సర్వేశ్వరుని వేడుకొనుచున్నావుగదా? దాని కంటె ఆత్మబ్రతుకుటకు కావలసిన మంచిమనసు స్వామి దయచేయునట్టు వారిని అడుగడుగుకు చురుకు తో ప్రార్థించవలసినది.

కడసారి వేడుకోవలసినది: ఉత్తమబాలుడా! మనుష్యులకు మంచి మనసు రప్పించేటట్టు దేవరవారు కట్టడచేసిన అనేకమార్గములు నా యొద్ద వ్యర్థమైపోకుండునట్టు, ఆ యా మార్గములలో నేను ప్రయోజనమును గయికొన, దేవరవారు సహాయముచేయుటకు, మీరు పుట్టినతోడనే అర్చ్య-జోజప్పగారు మీకు చేసిన మొదటి యూడిగమును గురించి మిమ్ము ప్రార్థించుచున్నాను. ఆమేన్ జేసు.

దివ్యబాలునిన్ని, కిరుతల్లిన్ని, అర్చ్య-జోజప్పగారిన్ని గురించి 1జో. 1ప్రి. 1త్రీ చెప్పాట.
(5 పుటనుండి 16 పుటవరకుగల జపప్రార్థన చెప్పాట)

---

## 7 వ-ప్రసంగము.

(దివ్యబాలుడు దరిద్రమును ప్రేమించుచున్నారు.)

దివ్యబాలుడయిన జేసునాథుడు ఆస్తిద్రవ్యములను అరోచించెడువారై యున్నారు. అదివెలాగంటే, ఆ స్తిద్రవ్యమునకు గల వ్యర్థ డంభమును బయలు పరచేటట్టు, ఈ దివ్యబాలుడు దరిద్రుడయి పుట్టిరి. ఈ దరిద్రమును వీరు కావలయునని తెలుసుకొనినందుచేత మృగములు వాసముచేయు గవిలోపుట్టి గాడిలో పరుండబెట్టబడ చిత్తమైరి. దరిద్రముగల వీరి జన్మమును ఆరసి చూచినట్టయితే ఎటువంటిపరదేశి, ఎటువంటి భిక్షుకుడుకూడా ఇటువంటి దరిద్రముతో పుట్టనేర

డు. ఆయారాజుల బిడ్డలు సకలసంపదలునిండిన రాజన
గళ్ళలోపుట్టుటకు సందేహము లేదు. రాజులందరికి రాజై
న జేసునాథుడు, సకల వస్తువులను కలిగించినవీరు, ఆస్తి
ద్రవ్యములమీాద అణుమాత్రి మైనను ఆపేక్ష యుంచి
యుండినట్టయితే, వెలలేని ద్రవ్య సంపత్తులు నిండిన
అలంకారమైన స్వర్ణ మందిరములో పుట్టవచ్చును.
ఇట్లుండగా మితిలేని దరిద్రముతో పుట్టిన ముఖాంతర
మేమి ? వారు నిరర్థకమైన వ్యర్థ ఆస్తిని సడ్డచేయ
నందుచేత ఈలాగుపుట్టిరి. మితిలేని ఆస్తిగల వీరుఆస్తిని
విసర్జించిత్రోసి వేసియుండగా, నీవు దానినిమిగులఘనము
గానెంచవచ్చునా ? నీవు చచ్చేటప్పుడు దానిని ఘన
ముగా నెంచుదువా? నాశనమైపోయెడు ఆస్తిముఖాం
తరముగా, మోక్షభాగ్యమును పోగొట్టుకొనునది
బుద్ధియో ? ఆస్తియొక్క విషయము ఈలాగున్నందు
చేత, పేదవారలారా, మీా దరిద్రములో సంతోషిం
చండి.

మరియు వ్యర్థ ఆస్తిద్రవ్యములో నుండెడు కీడును
మనుష్యులకు చూపించేటట్టు, దివ్యబాలుడు దానిని
నిరాకరించిరి. మనుష్యులకు సకల సౌఖ్యము కలిగిం
చెడు ఆస్తిద్రవ్యములో ఏమి చెరుపు ఉన్నదని కొం
దరు భాగ్యవంతులు అడుగుదురు. రుచిగల చాల
భోజనము ఆకలిగొన్నవానికి సంతోషము రప్పించి
నను, మితముదప్పి తినుటవలన అందునుంచి అజీర్ణ
మును, వ్యాధియును, చావును అనేకమారులు తట

క్షించుట గలదు. ఆ విధముగానే ఆస్తిద్రవ్యము విష యమునందును రోచించవలసినది. ఆ స్తిద్రవ్యము సంపాదించువాడు, దానిమీదనుంచిన మితిలేనిఆపేక్ష చేత, ఎంత సంపాదించినను అంతకంతకు అత్యాశ వృద్ధి యగుచుండును. మహోదరవ్యాధిగలవాడు ఎన్ని నీళ్ళు త్రాగినను తీరక, దాహము అధికరించును. ఆ విధముగా ముందు చెప్పిన విషయములో జరుగు చున్నది. ఆ యాశచేత ఇంకా ఎక్కువ ఆస్తి సంపా దించిచేటట్టు అన్యాయముగా వడ్డి తీసుకొనునదిన్ని, దొంగతనము, వంచన, మోసముచేయడము గాక, ఆ స్తిమూలముగా అహంకారము, మర్మము, పరనింద మోహము, త్రాగడము మొదలయిన పాపములు వచ్చును. అటువంటి వారలకు ఆ స్తిద్రవ్యము ఒక దైవముగా నున్నందుచేత, దానిని వెదకి సంపాదించే పనిమీద యుండి, సర్వేశ్వరునినిన్ని, వారి కల్పనల నున్ను, పరులనున్ను, తమ ఆత్మమునున్ను సడ్డ చేయక ఎటువంటి అక్రమముల నయినను చేయ తృ ణీకరించుచున్నారు. ఇది యంతా ఆస్తిద్రవ్యమునుంచి కలిగే గొప్ప మోసముగదా? ఇంకా దీనిని చక్కగా కనిపట్టేటట్టు జేసునాథుడు ఆనతించినదానిని వినుండు: "ద్రవ్యసంపన్నుడు మోక్షరాజ్యములో ప్రవేశించే దానికంటె, సూదిబెజ్జముగుండా ఒంటెదూరుట సుల భము" అనిరి. మేలైన ఈ బుద్ధిని చక్కగా కని పట్టినట్టయితే ఆ స్తిద్రవ్యములో అధికమైన చేటు

గలదని ఒక్కొకరు గట్టిగా తలంచేదిగాక, దానిమీద
ఆశ విడిచిపెట్టవలసినది.

అట్లయితే ఉన్నది పోగొట్టుకొని అందరు భిక్ష
మెత్తుకొనేటట్టయితే పెట్టేది ఎవరని కొందర డుగు
దురు. మేము ఆలాగు ఉన్నది పోగొట్టుకొని భిక్ష
మెత్తుకోవలయునని చెప్పడము లేదు. అపోస్తులయిన
అర్చ్య-చిన్నప్పగారు వ్రాసినలాగు, శరీరజీవనమునకు
కావలసిన వస్త్రభోజనములు నానాటికిఉంటేచాలును.
ఇందుచేత వీటిని ఆరోజుకు ఆరోజుకు సంపాదించడ
ము అవసరమును క్రమమునై యున్నది. ఆస్తి ద్రవ్య
మూలముగా అనేకమంది సర్వేశ్వరునికి ద్రోహము
చేయుచున్నారు. కొంతమంది దరిద్రులుగా నున్న
ప్పుడు సాధుగుణము, తాళిమిగల మంచివారలుగా
నుండిరి. వారలకు ద్రవ్యము చేకూడి వచ్చినవిమ్మట
ఆ మంచి గుణము మారిపోయి, అహంకారులై, పని
చేయని సోమరులై, త్రాగుబోతులై, వ్యభిచారులై,
చిన్న పెద్దలను లక్ష్యపెట్టక తిరగడము మీరుచూడ
డములేదా? ఆ స్త్రీ దరిద్రముగా నున్నపుడు కూలి
నాలిచేసి మేర మర్యాదగానుండినది. ఇపుడు నాలుగు
డబ్బులుకూడగానే, ఆ పనియంతా విడిచిపెట్టి, పో
ట్లాడునదిన్ని, బడాయిగా తిరుగునదిన్ని, తిట్టునదిన్ని,
ఆస్తిచేత సంపాదించిన సొమ్ములను, వంటినిండా దిగ
వేసుకొని భోగముసానిగా తిరుగుచు తన ఆత్మకును

పరుల ఆత్మలకును చేటు రపింపుచున్నదని కొన్ని మారులు మీరే ఎరిగి యుందురు.

ఈ కీడు లన్ని ఆస్తిమంతుల బిడ్డలుగా నున్నవి. నాకు ఎంత ఆస్తి యుండినను దానిమీద ఆపేక్ష పెట్టక, దానిమూలముగా ధర్మముచేసి పుణ్యము సంపాదించుకొనుటయేగాక, పాపము కట్టుకొనుట లేదని కొందరు చెప్పుదురు. అటువంటి కార్యముకూడ నికార్యము కాను. అయితే అలాగు చేయువారలు బహు అపూర్వము. నల్లకాకులు అనేక ముండినను, అందులో తెల్లకాకిని చూచునది బహు అరుదుగదా! ఆ విధముగా ముందుచెప్పిన కార్యములో యోచించ వలసినది. ఆ యా గ్రామములలో నుండెడు అనేక ఆస్తిమంతులలో, ఉత్తమపుణ్యవంతుడయిన ఒకనిని చూచునది నిండా అరుదుగా నున్నది. ఆస్తిమంతుల యొద్దనున్న అనేక పాపములు ఏమిలేని బీదవారల యొద్ద కనుపడవు. దరిద్రులయొద్దనున్న అనేక పుణ్యముః ఆస్తిమంతులయొద్ద లేవని అనేకమారులు శోధించి ఎరిగి యున్నాము.

ఇట్లుండగా ఆస్తిద్రవ్యముమీద పక్షముంచి, దానికి తన్నుపూర్ణముగా ఒప్పగించవచ్చునా ? ఇది యునుగాక, ఒక దొర తాను తలంచినకార్యము అనుకూల మయ్యేటట్టు వేరేదేశములో నుండునపుడు, దరిద్రవేషముగా నుండుటను వాని వెంబడిపోయిన సేవకుడు కని తాను ఆస్తిమంతుని వేషముగా నుండు

ట తగునా ? సుతుడయిన సర్వేశ్వరుడు భూలోక ములో మనుష్యుడుగా పుట్టినప్పుడు, మహాదరిద్రుడుగా పుట్టుటను వారి శిష్యులమైన మనము చూచి, ఆ స్తి మీద ఆశపడి, దానిని ఆపేక్షతో వెదకుట తగునా? ఇందుచేత మనము వారివలె ఆస్తిని విసర్జించ వలసినది.

కడసారి వేడుకో వలసినది: ఉత్తమ ఉపాధ్యా యులైన దివ్యబాలుడా! దరిద్రముమీద, దేవరవారు క్రియచేత బోధించిన శాస్త్రమును నేనుకనిపట్టి దాని ప్రకారము నడచుకొన సహాయము చేయవలయునని దేవరవారు పుట్టినతోడనే మిమ్మునమస్కరించి పొగడి పాడిన సన్మనస్కులను గురించి మిమ్మును ప్రార్థించు చున్నాను. అమెన్ జేసు.

దివ్య బాలునినిన్ని, తిరుతల్లినిన్ని, అర్చ్య-జోజప్ప గారినిన్ని గురించి 1జ్యో. 1ప్రి. 1త్రి. చెప్పుట.

(5 పుటనుండి 16 పుటవరకు గల జపప్రార్థన చెప్పేది. )

---

# 8 వ-ప్రసంగము.

(దివ్యబాలుడు మనకు తాత్త్విమాత్రిక నిచ్చు చున్నారు.)

దివ్యబాలుడైన జేసునాధుడు, లోకముయొక్క ప్రతా ష్ఠములన్నిటిని నిందించెదువారై యున్నారు.

లోక మేలులచేత నిండియుండిన రాజు, పసిబిడ్డగాపుట్టి నపుడు, వాని ప్రతాపమునకు కావలసినవాటిలో మహా అలంకారమైన మేడలో పుట్టేదిగాక, నగరువాకిట అనేక సేవకులు కాచుకొని యుండుచునదిన్ని, ఆనగరు హజారములో ప్రధానులును, రాజ వంశస్తులును నిండియుండునదిన్ని, నగరులో అనేకమంది పనివారలు ఉండుటయేగాక, విశేషముగా ఆబిడ్డనుకనిన రాణియుండెడు అరలో, పలువురుదాదులు, మంత్రసానులు చెప్పినపని చేయుటకు ఆజ్ఞగా కాచుకొని యుండగా, సకలవస్తువులుగలతల్లినుండిఆబిడ్డపుట్టును. ఆబిడ్డ పుట్టినతోడనే నవరత్నములు దాపిన ఉయ్యాలలో పట్టువస్త్రముతో కప్పి పండబెట్టుదురు. సంతోషగురుతుగా ఫిరంగులు కాల్చి సంగీతమేళ వాద్యములను ప్రయోగించి, ఆబిడ్డపుట్టిన పట్టణములోను తక్కిన సమస్త దేశములలోను, రాజకుమారుడు పుట్టిన శుభ మహోత్సవమును ఆరభారముగాకొనియాడబడును. దీనికంటే రాజులకు రాజైన దివ్యబాలుడు పుట్టినపుడు అధిక మహిమ, అడంబరము జరుగవలసి యుండెను. అయితే అలాగు నడచినదో లేదో అని వినండి.

ముందు చెప్పబడిన రాజుయొక్క మహిమకును, దివ్యబాలునియొక్క ఉన్నతమహిమకును ఎంతవ్యత్యాసముగా నున్నది? అది ఏలాగంటే, మిగుల దరిద్రముగొనియున్న తల్లియొద్దనుండి తాము పుట్టవలయునని తెలుసుకొనిరి. దివ్యబాలుడు పుట్టిననగరు, గొడ్లను

కట్టివేయు కొట్టము. ఉయ్యాలకు బదులుగా గొడ్లు మేతమేయు గాడిలో పరుండబెట్టబడిరి. వారికి ఊడిగము చేయుటకు వారిని కనిన తల్లితప్పవేరే ఆడవాండ్లులేరు. ఆకొట్టములో వీరికి తోడుగా రెండుమృగములుమాత్రముండినవి. అక్కడ వొకదీపముకూడా లేదు. కాబట్టి ముందుచెప్పబడిన రాజుయొక్క ఆర భారములు లేకుండా ఈదివ్యబాలుడు పుట్టెరి. ఇవియన్ని దేవబాలుడు కావలయునని తెలుసుకొనినందు చేత, లోకమహిమలను వారు బొత్తిగా నిందించు వారుగానున్నారు. ఎందుకు ఈలాగు నిందించుచున్నారంటే, లోకమహిమలమీద పూర్ణముగా ఉంచబడిన మనుష్యుల మితివిరారిన ఆశను బొత్తిగా పీకివేసేటట్టు తాము పుట్టినప్పుడే దానిని నిందించిరి.

మహాబుద్ధిగల ఒకగొప్పరాజు లోకముయొక్క ప్రతాపమును స్వేచ్ఛగా నిందించుటకు తక్కిన వారలు చూచి దానిలో ఏదొకమోస ముండునని తలంచి యుందురు. మితిలేని బుద్ధిజ్ఞానముగల గొప్ప రాజైన జేసునాధుడు, లోకముయొక్క మహిమలను బొత్తిగా నిందించుటను బుద్ధిమంతులుచూచి దానిలో కీడుయుండునని యోచించవలసినది. లోకముయొక్క మహిమలోగల మోసము యేమిటిదంటే, ఇప్పుడు చెప్పుదానిని వినండి. లోకముయొక్కమహిమ, అహంకారమునకు కారణముగానున్నది. అహంకారముచేత అనేకకీడులు వచ్చుచున్నవని అందరు యెరిగియే యు

వ్నారు. లోకముయొక్క మహిమ అహంకారమునకు తల్లిగా నున్నందుచేత అహంకారముచేతవచ్చెడు కీడులన్ని లోకమహిమలో అణగియున్నవి. లోకమహిమ ఎవరియొద్ద అధికముగా నున్నదో, వారలయొద్ద అహంకారమును అధికముగానుండును. అటువంటి లోకమహిమగల వారలలో ఒకడైనను అహంకారములేనివాడుగా నుండడను మిగుల అపూర్వముగా నున్నది. ఇప్పుడు చెప్పినప్రకారమే లోకముయొక్క మహిమ ముఖాంతరముగా అహంకారము వచ్చుననుటచేత, మనుష్యులు దానిమీద ఆపేక్షనుంచకుందునట్టు ఈ దివ్యబాలుడు తాము పుట్టేటప్పుడు దానిని పూర్ణముగా నిందించిరి. ఇట్లుండగా ఈ గొప్పరాజుయొక్క ప్రజలమైన మనము లోకముయొక్క నాశనమయ్యేడు మహిమమొదల ఆపేక్షయుంచి దానికొరకు లెస్స ప్రయాసపడునది తగునా?

మరియు ముందుచెప్పినలాగే, జేసునాథుడు మహా తాళ్మితో పుట్టిన అభిప్రాయమేమి? జ్ఞాన ఆచార్యునివలె ఈ దివ్యబాలుడు, మనుష్యులకు తాళ్మియనెడు పుణ్యమును నేర్పించ ఈలాగుపుట్టిరి. ఉపాధ్యాయుడు ఏదొక శాస్త్రమును ఇతరులకు నేర్పించ వలసినట్టయితే, బుద్ధిచేత నేర్పించునుగదా? ఈ దివ్య ఆచార్యుడు మాట్లాడక నుండినను, తాళ్మియనెడుపుణ్యము నేర్పించునది ఏలాగని అడిగితే ఇప్పుడు చెప్పునది. వినండి. బుద్ధిమూలముగా నేర్పించుటయేగాక, క్రియ

వల్లను వేరే నేర్పు గలదు గదా? తల్లిదండ్రులు తమ బిడ్డలయెదుట చేయు ధర్మపుణ్యములవల్ల బిడ్డలకు ధర్మము చేయు వగను క్రియచేత నేర్పించుచున్నారు గదా? ఆవిధముగా మాట్లాడకయుండు ఆ దేవబాలుడు, తాక్షియనెడు పుణ్యమున్క్రియచేత నేర్పించుచున్నాడు. బుద్ధిగలవాడు దివ్యబాలుడు పుట్టిన పశువుల కొట్టము నకుపోయి, తాక్షిగల ఈ పుట్టుకను ఈ దేవబాలుడు స్వేచ్ఛగా తెలుసుకొనినారని విచారించి వారియొక్క నున్న అటువంటి వందనమునకు తగినక్రియలో తాక్షియనెడు పుణ్యమును అభ్యసించును. అటువంటి నేర్పు అందరికిని గావలసి యున్నది. అహంకారమును ఆలోచించి, తాక్షియనెడు పుణ్యముమీద ఆశవుంచేటట్టు ఇప్పుడు చెప్పబోవునది వినండి.

మోక్షములో ఆయా అంతస్తు గలవారలుండినను తాక్షిలేనివారలు ఎవరును అక్కడలేరు. వానకురిసేటప్పుడు మిట్టమీద నీళ్ళు నిలువక పల్లముగా నున్న చోటికి పోయి చేరుచున్నవిగదా? ఆ విధముగానే, స్వామితాక్షిగలవారలకు హేరాళమేలులను కట్టడచేయుదురు. నేను పాపాత్ముడననికొందరు నోటితో తాక్షిగలమాట చెప్పినను వారలయొద్ద నిజమైన తాక్షిగలదో లేదో, సందేహము. నిందగలమాటయైనను క్రియయైనను వారలకు విరోధముగా ఏదొకడు చెప్పినను చేసినను, నిందింపబడిన వారలు తాక్షితోనుండి నట్టయితే నిజమైన తాక్షివారలయొద్ద నున్నదనుటకు

అడియాల మగును. అహంకారము చూపినట్లయితే, వారలయొద్ద నిజమైనదాతృత లేదని ఎరుగుము(గాక.

ఒకసారి వేడుకోవలసినది: దివ్య ఉపాధ్యాయుడా! నేనులోకముయొక్క ప్రతాపమును నిందించి తాత్త్వి యనెడు పుణ్యమును అభ్యసింప దేవరవారు సహాయముచేయులాగు దివ్యబాలుడైన మిమ్మును సంధించిన ముగ్గురు గొల్లవారలను గురించి మిమ్ము ప్రార్థించుచున్నాను.

అమెన్ జేసు.

దివ్యబాలునినిన్ని, తిరుతల్లినిన్ని అర్చ్య జోజప్ప గారినిన్ని గురించి 1 జో. 1 ప్రి 1 త్రీ చెప్పుట.
( 5 పుటనుండి 16 పుటవరకుగల జపప్రార్థన చెప్పుట)

---

## 9 వ-ప్రసంగము.

(దేవసుతుడు సుఖమును విసర్జించుచున్నారు)

దివ్యబాలుడైన జేసునాథుడుసుఖమును నిందించెడు వారైయున్నారు ఈ దివ్యబాలుడు సుఖముమీద మనసుగా నుండినట్లయితే ఆయారాజులు అనుభవించెడు సుఖ సౌఖ్యమునకంటె లక్షమడుగులు అధికమైన సుఖముతో పుట్టియుండవచ్చును. తమ్మును కనిన తల్లియింటిలో పుట్టినట్లయితే సుఖముతో పుట్టవచ్చునే. చలిన్ని,మంచున్ను, అధికమైన హేమంత కాలములో,

బిడ్డలు పుట్టునపుడు వారలమీాద చలిమంచు పడకుం డా ఇంటివాకిలినిమూసి ఉష్ణమును కలిగించు నిప్పుల కుంపటి మొదలగునవి యుండినట్టయితే బిడ్డలుచా వక బ్రతుకుదురు. ఇదిలేనట్టయితే ఆచిన్న బిడ్డలకుచాల సంకటముగా నుండును. అయితేదివ్య బాలుడు పూర్ణ ముగా సుఖమును విసర్జించిన వారైనందున సుఖముగల తమ తల్లి యింటిలో పుట్టక సుఖములేని నిర్భాగ్యస్థలమైన పశువుల కొట్టములో పుట్ట చిత్త మైరి.

ఈ దివ్యబాలుడు పుట్టిన దినమునున్ను సమ యమునున్ను పరిశోధించి చూచినట్టయితే ఇది తెలియ నగును. వీరు పుట్టిన స్థలము పశువులకొట్టముగదా ? దాని వాకిలికి తలుపుగాని తడికగాని అడ్డములేనందున గాలికిని చలికిని మంచుకును చాటు లేకుండినది. తల్లి యింటిలో గల సుఖమునకు తగిన ఆదూా సహాయము పశువులకొట్టములో లేదు. పుట్టిన పిమ్మట ఆ దివ్య బాలుని పరుండబెట్ట తగిన స్థలము లేదు గనుక, కొంచెము ఎండుగడ్డిమీాద పరుండబెట్టబడిరి. అన్ని మాసములకంటె అధిక ఎక్కువ చలిగల మార్గశిర మాసమున పుట్టిరి. పగలులో పుట్టినట్టయితే చలి చేత అంతకష్టముతోచదు. పగలులోగాని రాత్రిప్రవే శములోగాని పుట్టక అధిక చలిగలసమయమైన నడు రేత్రిలో పుట్టిరి. పసిబిడ్డయయినందుచేతను, మహామృదు శరీరమైనందుచేతను, ఆలాగు పుట్టునపుడు ఎంత కష్టి

అనుభవించినారని ఎవరివల్లను కనిపెట్టకూడదు. ఇప్పు డు చెప్పిన కష్టసంకటము లన్ని ఆ దివ్యబాలుడు పుట్టినపుడే అనుభవించుటకు మనుష్యుల రక్షణము నకు అవసరము లేకుండినను, వాటిని అనుభవించ నేల? అది రక్షణమునకు అవసరము లేకుండినను మనుష్యులకు కావలసిన పుణ్యాచేర్పుకు అవసరముగా నున్నందుచేత, ఆ దివ్యబాలుడు స్వాయిచ్ఛతో ఆకష్ట సంకటములను అనుభవించిరి. ఏమి అవసరమని ఇపు డు చెప్పబోవుదానిని వినండి.

మనుష్యుడు ఎప్పుడును సుఖక్షేమముగా నుండు టకు ఆశగా నుండునేగాని, కష్టసంకటమునొందుటకు ఒకప్పటికిని ఇష్టపడడు. ఇది ధర్మమార్గములో నడ చుటకు విఘ్నముగా నున్నందుచేత, అటువంటి మన నును త్రోసివేసి ఈ కార్యములో మంచి మనసు వచ్చేటట్టు ఈ దివ్యబాలుడు సుఖమును బోత్తిగా నిందించిరి. కొన్ని సుఖములకు పాపముయొక్క కీడు ఉన్నందుచేత, అది పూర్ణముగా తొలగించవలసినది. కొన్ని సుఖములకు ముందు చెప్పబడిన కీడు లేకుండి నను ముందు చెప్పినలాగు ధర్మమార్గములో చురుకు గా నడచుటకు విఘ్నముగా నున్నందుచేత, వాటిని సడ్డచేయక నుండవలసినది. మోక్షములో చేరేలట్టు చేసిన పాపములకు తపసు చేయవలసినది. తపసు చేయుటకును, సుఖమును అనుభవించుటకును, బహు

వ్యత్యాస మున్నందుచేత, తపమును గయికొనేటట్టు సుఖములను నిదించవలసినది.

ఇదిన్ని గాక, సుఖముమీాద మనుష్యులు ఎంత ఆపేక్ష నుంచినను, దానిని వెదక ఎంతప్రయాసపడి నను, ఎప్పుడున్ను సుఖముగా నుండునది కూడని కార్యము. ఒకనాడు సుఖములో నుండేవారలు, పిమ్మట ఒక నెల, ఒక సంవత్సరము వరకు సుఖము లేక యుందురు. ఈ లోకసుఖమైనది తేనెబొట్టుకు సమానముగా నున్నది. కష్టమైనది సముద్రములోని ఉప్పునీళ్లవలె నున్నది. భూలోకము కన్నీటికనము యని చెప్పబడునదేగాక, సంతోషముగల పట్టణమని చెప్పబడడము లేదు. ఇందుచేత భూలోకములోనుండు వారలు చాలకష్ట దురితములు అనుభవించవలసి యున్నది. ఇటువంటి కష్ట దురితములు ఏమైనను ఇంపు మయ్యేటట్టు దివ్యబాలుడు పుట్టినపుడు ఆసుఖముతో తాము పుట్టకూడియుండిన్ని అల్పసుఖము నైనను అనుభవింపక, నిండిన కష్టితో తాము పుట్టినది కష్ట పడేవారలకు తగిన ఆరుదలగా నున్నది.

దీనిని చక్కగా కనిపట్టేటట్టు ఇపుడు చెప్పబోవు ఉపమానమును వినండి.

మహాచేదైన కషాయమును, వ్యాధికాడు త్రాగ డము లేదనినది వైద్యుడు చూచి, వ్యాధికాడు ఆ మందును ఏలాగయినను త్రాగేటట్టు చేసిన ఉపాయ మేమనిన: వ్యాధిలేని నేను ఈమందును త్రాగవలసిన

అవసరము లేకపోయినను, త్రాగవచ్చునని ఏకుకను కరిచేటట్లు ఇదిగో త్రాగుచున్నాను చూడుమని చెప్పి ఆ మందును వైద్యుడే ముందుగా సగము త్రాగెను. వ్యాధికాడు అదిచూచి రోషము తెచ్చుకొని మిగిలిన మందు త్రాగి రోగముకుదిరి బ్రతికెను. పాపమనే వ్యాధిగల మన మందరమును ఆత్మ బ్రతుకుటకు వచ్చెడు ఆ యా కస్తి సంకటములను ఓర్పుతో అనుభవించవలసి యున్నది. చేదుగల ఇటువంటి కస్తిని ఓర్వజాలనని ఏదో కడు చెప్పకుండుటకు, జ్ఞానవైద్యుడైన ఈదివ్యబాలుడు చేసిన కార్యమైనది: కళంకము లేని పరిశుద్ధముగల తాము భూలోకములో నుండెడు ఏదొక కస్తినయినను అనుభవించ అవసరము లేకుండినను, అటువంటి కస్తులను అనుభవించవచ్చునని చూపించేటట్లు, తాము అధిక కస్తిఅనుభవించిరి. దీనిని మనము ఎరిగి సుఖమును సడ్డచేయకుండా ఆ యా కస్తులను ఓర్పుతో అనుభవించ ప్రయాస పడవలసినది.

కడసారి వేడుకోవలసినది: దివ్యబాలుడయిన నా జేసునాథుడా! దేవర వారు బహుకస్తితో పుట్టి, కస్తి మూలముగా మోక్షమునకు వేంచేసియుండగా, పాపినైన నేను సుఖముగుండా మోక్షమునకు పోను తలంచి యుండుసద పైత్యమే నే. ఈ పైత్యముపోయి కస్తియునిడు మార్గములో నేను ఓర్పుగానుండ దేవర వారు సహాయముచేయవలయునని పసిబాలుడైన

మిమ్మును సంధించిన గొల్లవారలను గురించి మిమ్ము ప్రార్థించుచున్నాను. ఆమెన్ జేసు.

దివ్యబాలునినిన్ని, తిరుతల్లినిన్ని, అర్చ్య-జోజప్ప గారినిన్ని తలంచి 1జ్యో. 1ప్రి. 1త్రి. చెప్పుట.

(5 పుటనుండి 16 పుటవరకు గల జపప్రార్థన చెప్పేది. )

---

# 10 - ది. స్వామి పుట్టిన సందుగ ప్రసంగము.

---

సర్వేశ్వరుడు పరలోక భూలోకమును సృష్టించిన నాలుగువేల నాలుగోసంవత్సరములోను, జలప్రళయము సంభవించిన రెండువేల తొమ్మిదివందల ఏబది ఏడవ సంవత్సరములోను, పితాప్రీతుడయిన అబ్రహామనేవారు పుట్టిన రెండువేల పదిహేనవ సంవత్సరములోను, దీర్ఘదర్శియైన మోయీజనేవారును ఇస్రాయేల్ జనులును ఎజిప్తు దాసత్వము విడిచివచ్చిన వెయిన్ని ఐదువందల పదియవ సంవత్సరములోను దావీదనేవారు రాజ్యాభిషేకము పొందిన వెయిన్ని ముప్పది రెండవ సంవత్సరములోను, దీర్ఘదర్శియైన దానియేలు ముందెరిగించిన ప్రకారము అరువదియైదవ సంవత్సరవారమైన ఎప్తోమదిలోను, నూటతొం

ఖదినాలుగవ ఒలింబియాదిలోను, రోమాపురికలిగిన ఏడువందల యాబైరెండవ సంవత్సరములోను, రోమను రాజ్యాధిపతియైన సేజార్ అగుస్తుస్ అనేవాడు రాజుపట్టము పొందిన నలుబది రెండవ సంవత్సరములోను, లోకమంతట పూర్ణ సమాధానము కలిగి యుండుకాలములో, లోకముయొక్క ఆరవ యుగములో జేసుక్రీస్తు ననబడిన సుతుడయిన సర్వేశ్వరుడు పితయైన సర్వేశ్వరునికి సరిసమానమైన కుమారుడై యుండగా, అర్పింపబడిన తమ ఆగమమును గొని లోకమును రక్షింప చిత్తమైయుండి, స్పిరితుసాంక్తు వల్ల ఉద్భవించి అందుకు తొమ్మిదవ మాసములో యూదెయా సీమలోగల బెత్లేమనే యూరిలో మార్గశిరమాసమైన ఈ తారీఖునందు ప్రసిద్ధముగా స్తుతించబడు కన్యాస్త్రీయైన అర్చ్య-మరియమ్మగారియొద్ద మనుష్యుడై పుట్టిరి. ఈ దేవజన్మముయొక్క వర్తమానము ఏలాగని బయలు పరుతుము.

లోకములో ఒకప్పుడును కనుబడని సమాధానము ముందు చెప్పినలాగు స్వామిపుట్టిన దినములలో కలిగి యుండినది. ఆ దినములలో గల రోమాపురియొక్క రాయుడు తనకు లోబడియున్న సకల ప్రజలను గణతి పట్ట అప్పుడు మంచి సమయమని తలంచి, వారివారి గోత్రము ఏ ఊరిలో అరంభించినదో ఆ ఊరికి వారలు పోయి తమ పేర్లు వ్రాయించ ఆజ్ఞాపించెను. ఆ కట్టడను అర్చ్య-జోజప్పగారును దేవమాతయును వినిన

తోడనే, తమగోత్రమునకు ఆరంభమైన దావీదురాజు బెత్లేమనే ఊరిలో పుట్టినందుచేత, తమపేరు వ్రాసి పెట్ట నజరేత్తనే ఊరువిడిచి ఆ ఊరికి పోయిరి. దానికి దీనికి మూడురోజులదూర ప్రయాణమైనందు చేతను, అర్చ్య-కన్యమరియమ్మ తొమ్మిదిమాసముల గర్భిణిగా ఉన్నందుచేతను, ఆ కాలము చలికాలమై నందుచేతను అర్చ్య-జోజప్పగారును దేవమాతయును ఆ ప్రయాణములో వాకుకందని కష్టి దురితములను అనుభవించిరి బెత్లేమనే పట్టణములో చేరినపిమ్మట, ఆ రాత్రి అక్కడ నిలుచుటకు అర్చ్య-జోజప్పగారు తమ బంధువుల ఇండ్లకు పోయి కొంచెము చోటివ్వమని అడిగినందుకు వారలగోత్రమునయినను చూడక అర్చ్య-కన్యమరియమ్మ నిండుగర్భిణిగా నుండుట నైనను చూడక, వారల దర్రిద వేషమును మాత్రము చూచి తమ యిండ్లలో చోటివ్వక నిందించి త్రోసి వేసిరి. అంతట అర్చ్య-జోజప్పగారు ఆ నిందను తాళ్మితో సహించుకొని, చావడి సత్రములలోనైనను స్థలము దొరుకునేమో యని విచారించగా, అవి యన్ని అంతకు ముందే విస్తారజనులచే నిండిపోయి యున్నందున, తావు దొరకదని చూచి, ఊరికి వెలుపల పోయి, సమీపములోనున్న ఒక కొండగవిని చూచి ఆ రాత్రికి నిలువ స్థలము వెదకి దాని లోనికి పోయి, ఒక ఎద్దున్ను, ఒక గాడిదయున్ను కట్టివేసి యుండిన, ఆ గుహాలో ఒదుగుకొనిరి. అర్చ్య-కన్యమరి

యమ్మగారును, జోజప్పగారును దేవజన్మరహస్యము మీాద కొంతసేపు సంభాషించి రనుటకు సందేహము లేదు. అట్టి సమయమున జ్ఞానసూర్యుడైన జేసునాథుడు ఉదయించే సమయమయినదని ఎరిగి, ఆ పరమ రహస్యముమీాద దేవమాత ధ్యానము చేయుచుండు నప్పుడు, అద్భుతముగా కాన్పు కష్టములేకుండాను, తమ కన్యముద్రకు ఛేదము లేకుండాను, నడుఝామున దివ్యబాలుని కనిరి. అ దివ్యబాలుని దేవమాత కనినతోడనే, వారు నిజమైన దేవుడుగా నున్నారని సాష్టాంగముగా పడి ఆరాధించి, వారు భూలోకమును రక్షించవచ్చినందుకు స్తోత్రము చేసిరి. ఆ సమయములో ఆ ఏలినరాలు ఏమాత్రము జ్ఞానానంద సంతోషమును, విశ్వాసమును,నమ్మికయును, దేవస్నేహమును కలిగియుండినదని కనిపెట్టకూడినవార లెవరు? ఆ పసిబాలుడు చలిచేత వణుకెత్తి ఏడ్చుచుండుటను చూచి కనికరముచేత అర్చ్య-కన్యమరియమ్మ వ్యాకులపడి, ఆ దివ్య శిశువును తమచేతులతో పూజ్యముగా నెత్తుకొని, ముందే తాము ఆ దివ్య బాలుని గురించి సంపాదించి తమతో తీసుకొనివచ్చిన శుద్ధ తెలుపైన సన్నని వస్త్రములతో ఆ దివ్య బాలుని చుట్టి, గడ్డివేసి గాడిలో ముందు చెప్పబడిన రెండు మృగములమధ్య పరుండబెట్టినవెనుక, చలిచేత గడగడ వణకుచున్న బాలునిమీాద ఆ మృగములు తమ నోటి ఆవిరిని విడిచి వెచ్చన కలిగించినవి.

మహాత్ములైన అర్చ్య-జోస్ఫుగారు:- కన్యమరియ మ్మకనిన బాలుని చూచినతోడనే వీరు పరలోకభూలోకము కలిగించిన నిజమైన సర్వేశ్వరుడని విచారించి ఆశ్చర్యవాదనముతోను, భక్తివినయముతోను, వారి పాదములయందు పడి ఆరాధించిరి. వారు ఆ ఉన్నత సౌందర్యముగల బాలుని చూచినపుడు మహా ఆనందము పొందిననను ఆ దివ్యబాలుడు చలిచేత వణుకొత్తి వచ్చుచుండుటనుజూచి వారును సునసునొచ్చి ఏడ్చిరి. అర్చ్య-మిఖయేలును, పరమండలములోనున్న తొమ్మిదివిలాస సభసన్మనస్కులును ముందు చెప్పిన గుహకువచ్చి తమ్మును కలిగించిన దేవసుతుడైన జేసునాధుని ఆరాధించిరి. వారలలో ఒకసన్మనస్కు అగుహాకు సమీపమున గొర్రెలను కాచుకొనియున్న గొల్లవారలకు, సూర్యునికంటే అధికమైన ప్రకాశముతో కనిపించి దివ్యబాలుడైన లోకరక్షకుడు పుట్టియున్న సమాచారమునున్ను, వారు ఫలానిచోటపుట్టియున్నారనిన్ని తెలియపరచి వారిని కనిపట్టెడు గురుతున్ను ఎరిగించిరి. దానికి పిమ్మట ఆసన్మనస్కు అక్కడ కనుపడిన మరి యనేక సన్మనస్కులతో చేరుకొని పరలోకమందు సర్వేశ్వరునికి స్తోత్రమున్ను, భూలోకములో మంచి మనసుగలవారలకు సమాధానమున్ను కలుగునుగాకయనే ఇంపైన సంగీతములను పాడిరి. ఆగొల్లవారలు ఈ సమాచారమంతటిని విని దివ్య బాలుని సేవించేటందుకు సన్మనస్కు చెప్పినస్థలముకు పోయి,

ఆగుహాలో ప్రవేశించి ఆ దివ్యబాలుని చూచినతో డనే సాష్టాంగముగా ఆరాధించిరి. వారలు దివ్యబా లుని చూపువలన బహుభక్తిన్ని జ్ఞానసంతోషమున్ను పొంది తామున్ను సర్వేశ్వరుని స్తుతించి స్తోత్రము చేసిరి. పిమ్మట వారలు దేవమాతకును, అర్చ్య-జోజ ప్పగారికిని చేయవలసిన మర్యాదచేసి తమ మందకు తిరుగాపోవునపుడు తమకు ఎదురుపడిన వారలందరికి తాము చూచిన సమాచారమును ఎరిగించిరి. దానిని వారలు విని ఆశ్చర్యపడిరి. మన ప్రేమకు తగిన దివ్య కర్తయొక్క జన్మవర్తమానమును సంగ్రహముగా బయలుపరచినట్టాయినది. దానికి సంబంధించిన కొన్ని విశేషములును బుద్ధిమతులును ఇప్పుడు చెప్పెదము. స్వామి పుట్టిన గుహ యెప్పుడును మహాపూజ్యముగా ను-సినది ఆ శిగుస్థలముయొక్క తత్కాలస్థితియేమని సంక్షేపముగా చెప్పిచూపుదము. ఈ తిరుస్థలము బెత్లేమూరికి సమీపమునగల తెల్లని సుద్దరాతిలో తొలచిన గవి. ఈ గవి 40 అడుగుల పొడవును 11 అడుగుల వెడల్పున్ను 9 అడుగుల యెత్తుచుగలది. ఈ గవిలో ఇంకొక చిన్న గుహాయును ఆగుహాలో గొడ్లు నీళ్ళు త్రాగుటకు ప్రమాణితో చేయబడినతొట్టి యొకటిన్ని ఉండినవి. ఈగవి గాలికి వానకు చాటు గాను, చూపుకు మరుగుగానుఉన్నది.

ఈ తిరుస్థలము మనపెలినవారు పుట్టిననాటనుండి ఎచ్చటనుగల పూర్వీక క్రీస్తువులవల్ల మహావందనము

తో సేవించబడి వచ్చుచున్నట్లు తోచుచున్నది. ఎందుకంటే స్వామి అవతరించిన 136 సంవత్సరములోనే అద్రియాన్ (Hadrian) అనెడు రోమను చక్రవర్తి అప్పుడు మహాప్రబలముగా నుండిన ఈవిధ వందనమును నిలిపివేయవలయునని వేనుస్ (Venus) అదోనుస్ (Adonus) అనెడు అశుచియైన రెండు దేవతల విగ్రహములను తిరుస్థలమైన గుహాలోనాటి, దానిచుట్టు ఈదేవతల పేర అలంకారమైన ఒకతోటనున్ను ఏర్పరచెను.

అయితే 327 సంవత్సరములో రోమను చక్రవర్తియైన కాన్స్టాంటైన్ (Constantine) అనువారి తల్లియైన అర్చ్య-హెలేనమ్మ (St. Helena) యనెడు చక్రవర్తిని ఈ అక్రమ యేర్పాటులన్నిటిని నిర్మూలముచేసి తిరు గుహామీద ఒక దేవాలయమునున్ను దాని సమీపమున ఒక కన్యాస్త్రీల మఠమునున్ను కట్టించినది. ఈ కట్టడములను 1236 సం॥లో మహమ్మదీయులు కొంతవరకు నష్టపరచిరి. అయితే కొంతకాలమునకు పిమ్మట జేసునాథుని తిరుసమాధిని మహమ్మదీయుల వశమునుండి గైకొన ఐరోపానుండి పంపబడిన క్లీవ యుద్ధవీరులు ఈ కట్టడములను మరమ్మతు చేసిరి. ఇప్పుడు తిరుగుహామీద కట్టబడిన దేవాలయముగాక లతీన్, గ్రేకు, అర్మీనియ సభలకు సంబంధించిన పలుమఠములును ఇంకా చుట్టుప్రక్కల తిరుకుటుంబము చేత అర్పింపబడిన పలుస్థానములలో పలు

కట్టడములును గలవు. తిరుగవిరోమాయనిన అర్చ్యిహారేణ్ చక్రవర్తినిచేత కట్టబడిన గుడియొక్క గూహకుక్రింద తూర్పు పడమరగా అమర్చబడియున్నది. ఈ తిరుగుహాకు పోవుటకు రాతితో చెక్కిన మెట్లు రెండు గలవు. వాటిలో నొకటి గ్రేకు సభవారల ఉపయోగమునకును, మరియొకటి లతీన్ ఆర్మీనియన్ సభవారలకును స్వా

ఆదిలో చట్టురాతియందు త్రవ్వి చెక్కిన తిరుగుహా యొక్క గోడలు పలుప్రక్కల సులభముగా కంటికి తోచతగ్గవి. అవి యిపుడు నానావిధవర్ణ రాళ్ళతోను పలువిధ చిత్రపట్టు వస్త్రములతోను శృంగారించబడియున్నవి. తిరుగవిలో ఇపుడు పలుపీఠములును భక్తికి తగిన స్వరూపములు ఉంచదగిన గోపురములును వీటికి తగిన దీపములును ఉన్నవి. ఇక్కడ యేసునాథస్వామి పుట్టిన స్థలమును వివరముగా గుర్తించుటకై, గ్రేకుల పీఠముక్రింద వెండి నక్షత్రమొకటి మూయబడియున్నది. ఈ నక్షత్రములో "ఇచ్చోట కన్యమరియమ్మ యొద్దనుండి యేసునాధుడు పుట్టెరి" అనెడు వచనము చెక్కబడియున్నది. దీని కవతల గుహలో ముందు పశువుల కొట్టమున్న స్థలమునకు నేరుగా చలువరాతితో చేయబడిన నీళ్ళతొట్టియొకటి యున్నది. దీని ప్రక్కన, ముగ్గురు రాజులు అక్కడికివచ్చి దివ్యబాలుని ఆరాధించిన వర్తమానముయొక్క జ్ఞాపకగురుతుయొకటి ఏర్పరచబడియున్నది. దివ్యబాలుడు

పుట్టినకాలములో ఆ గవిలోనున్న ప్రమాణితొట్టి 382 సం॥లో అర్చ్య-హెరోణిమునుగారు అక్కడికి తిరుయాత్రగా పోయినప్పుడు అక్కడ యుండినది. అయితే అది 642 సం॥లో మహమ్మదీయుల కొల్లకుభయపడి రోమాపురికి కొనిపోబడినది. ఇప్పుడది అక్కడ మరియమాజోర్ (Maria Major)అనుదేవాలయములో పూజ్యముగా పెట్టెలోనుంచబడి ఆచరించ బడుచున్నది. ఈ తొట్టిని మూసుకొనియుండు ఐదుప్రమాణిపలకలను కాలదోషముచేత నల్లబడిపోయినదిగాక మరి ఏవిన్ని చెడుపు లేకనున్నవి.

దివ్యబాలుడు పుట్టినపిమ్మట దేవమాత శుద్ధమైన వస్త్రములతో ఆ దివ్యబాలుని కప్పిరని చెప్పితిమి. ఆ తిరువస్త్రమును మొదట కాన్స్తాంతినోపిలు పట్టణమునకు గొనిపోయి దానిని గురించి కట్టిన గుడిలో ఉంచబడియుండినది. పిమ్మట కాన్స్తాంతినోపిలు రాజైన బల్దుయీన్ అనువాడు ఆ అర్చ్యశిష్టపండమును ప్రాన్సురాజైన అర్చ్య-లుదోవిక్ అనువారికి ఇచ్చినందున దీనిని వారు సంతోషముతో తీసుకొని, పారీసు పట్టణములో నుండెడు ప్రధానగుడిలో స్థాపించిరి. ఇప్పటికిని దానిలో అది మహాపూజ్యముగా కాపాడబడియున్నది. ఆ దివ్యబాలుడు ఆదివారము రోజున పుట్టిరి.

క్రీస్తువులారా! ఈ పండుగకాలముగా మీ ఆత్మలకు జ్ఞానప్రయోజనము వచ్చేటట్టు ఇప్పుడు

చెప్పబోవు బుద్ధులను వినండి. ఆ యా రాజులు
బహు అలంకారమైన నగళ్లలో పుట్టియుండగా, రా
జాధిరాజైన జేసునాథుడు ఒక పశువులకొట్టములో
దరిద్రుడుగా పుట్టినకారణ మేమి? అహంకారమును
లోకచల్వమును ద్రవ్యాపేక్షయును, మోక్షమునకు
గొప్ప విఘ్నముగా నున్నందుచేతను, మన రక్షణము
నిమిత్తము పుట్టిన జేసునాథుడు మనుష్యులకు మో
క్షమార్గము చూపించవచ్చినందుచేతను, దరిద్రము
తోను, తాళ్మితోను, నీచమైన గొడ్లకొట్టములో
పుట్టిరి. యింటిచేత కలిగించబడిన మనుష్యులు దీనిని
గని అహంకార డంభమును అరోచించి, లోకమహి
మలమీదగల అపేక్షలను విడిచి, ఇక మనసులో
వాటిమీద తలంపుబెట్టకుండా దరిద్రముమీద కోరిక
నుంచవలసినది. మరియు పరాపరవస్తువైనవారు మను
ష్యరూపముగా పుట్టినందుచేత, వారిని మనుష్యులు
మిగుల స్నేహించవలసినది. ఒక రాజ్యములో క్రొత్త
గావచ్చినరాజును, ఆ దేశస్థులు స్నేహించక నుండి
నను ఆ రాజు శ్లాఘ్యమును విడిచి, ఆదేశములోనున్న
మనుష్యులు ధరించుకొనియుండు వస్త్రములరీతిగా
తానును ధరించుకొని, ఏవేళయును తన ప్రజల స్వ
మేలుకయి కష్టించుటను చూచినతోడనే వారలు
వానిని స్నేహించుదురు. నీవు ఇదివరకు సర్వేశ్వరుని
స్నేహించక నుండినను, వారు నీవలె మనుష్యుడై నీ
స్వభావము నెత్తుకొని నిన్ను రక్షింప వచ్చియున్నా

రని తలంచి వారిని స్నేహించవలసినది. ఆదితండ్రి వలె యవ్వన మనుష్యుడుగా జేసునాథుడు రాక, పసి బాలుడుగా వచ్చినందుకు కారణ మేమంటే, పసి బాలునిమీద అందరికి పక్షముకలుగుచున్నదనుట చేత, మనుష్యులు తమ్మును సులభముగా స్నేహించే టట్లు, సుతుడయిన సర్వేశ్వరుడు బాలరూపముగా భూలోకమునకు వచ్చిరి. ఇందుకు ఉపమానముగా ఒక దుష్టస్త్రీ, గుడిలో దివ్య సత్ప్రసాదముతీసి రహస్యముగా దానిని తన యింటికి తీసుకొనిపోయి, తన దుష్టతనముచేత దివ్య సత్ప్రసాదమును క్రిందపడవేసి కాళ్ళతో త్రొక్కునపుడు దానిలోనున్న జేసునాథుడు పసిబాలుని రూపముగా ఆమెకు కనిపించి మేము నీకు ఏమి కీడుచేసితి మనిరి. ఆ తిరుబాలుని ఆమె చూచినతోడనే మనసు తిరిగి తన పాపముకొరకు ఏడువసాగి, హా! స్వామీ! దేవరవారు నన్ను మిగుల స్నేహించుచున్నారు అనినది. పాపాత్ములారా! ఈ దుష్టస్త్రీవలె పశువుల కొట్టములోనున్న జేసునాథుడయిన దివ్యబాలుని ఈ పండుగలో ఆత్మ కంటితో చూచేమీరు యోచించవలసినది. నన్ను రక్షింప పుట్టిన ఈ దివ్యబాలునికి పాపియైన నేను ఎంతో కస్తిరప్పించితిని. నన్ను మిగుల స్నేహించిన ఈ దేవబాలునికి నేను చేసిన పాపములచేత ద్రోహము చేసినానని తలంచి, అందుకొరకు ఉత్తమమనస్తాపముగా నుండవలసినది. మరియు నీవు ఆ కాలములో

ఈపశువుల కొట్టములోనుండి, చలిచేత వణుకుచున్న ఆ దివ్యబాలుని చూచియుందువేని వారి చలిని పోగొట్ట నీ వస్త్రములలో ఏ దయినను ఇచ్చియుందువు గదా ? అటువంటి గొప్ప పుణ్యమును ఇప్పుడు చేయు విధమును నీవు కనిపట్టేటట్లు ఇప్పుడు చెప్పబోవు దానిని ఆలకించుము. జేసు సభలో ప్రవేశించిన మహాత్ములైన మనువేలనే స్వాములవారు, ఈపండుగ నడుఝామున దేవజన్మముయొక్క పరమరహస్యమును ధ్యానించునపుడు, అలంకారముగా కనిపించిన ఒక బాలుడు చలిచేత గడగడవణకుచుండినది వారు చూచిన వెనుక, చలిచేత చచ్చెడు నన్ను మనువేలను వాడా దేవస్నేహ అగ్ని చేత వెచ్చనపరుచుమని చెప్పి మరుగై పోయిరి. కనుపడిన బాలుడు జేసునాథుడేనని వారు కనిపట్టిరి. కాబట్టి బాలజేసునాథుని స్నేహించినట్టయితే ఆ దేవ స్నేహాగ్నినిగొని చలిచేత వణకిన దివ్యబాలుడయిన జేసునాధునికి ఉష్ణము కలిగించినట్టగుచున్నది. అటువంటి దేవస్నేహాగ్ని మీయొద్ద పుట్టేటట్లు ఇప్పుడు చెప్పలాగు యోచించవలసినది: పరాపరవస్తువైన సర్వేశ్వరుడు మనలను రక్షించేటట్లు, బాలరూపముగా పుట్టినపుడు, బహుకష్టి దరిద్రమును అనుభవించిరి. తమ జన్మమునకు పన్నెండు మాసములలో అధిక చలిగల మార్గశిరమాసమునున్ను, పగటికంటె అధిక చలిగల రాత్రినిన్ని, రాత్రిలో అధిక చలిగల నడుఝామునున్ను తెలుసు

కొనినదిగాక, తమతల్లిగారి యింటిలో పుట్టక చలికిని గాలికిని చాటులేని, ముందుచెప్పబడిన పశువులకొట్టమును తాము పుట్టెడు ఇల్లుగా తెలుసుకొనినందువలన అప్పుడు బహుకష్టి అనుభవించి నీమీద వారికి గల పక్ష మెంతయని చూపించిరి. ఇందుచేత, నిన్ను మిగుల స్నేహించిన వారికి నీవు ప్రతి పక్షము చూపించవలసినది. మరియు జేసునాథుడు పుట్టిన దినములలో నీవు జీవముతో యుండి ఆ దివ్యబాలుడు చేతులు చాచి నీ వడిలోకి రాను ఆశ చూపించి యుండినట్లయితే, నీ చేతులను తోడనే శుద్ధముచేసి, భక్తి ఆశతోను సాష్టాంగ వందనముతోను, వారిని ఆరాధించి, ఆ దివ్యబాలుని నీ చేతులలో ఎత్తుకొని, వారి తిరుపాదములను ముద్దుచేసి యుందువుగదా? ఆ కాలములో పుట్టిన ఆ దివ్యబాలుడే దివ్య సత్ప్రసాదముగుండా ఈ దినము నీ హృదయములోకి రాను ఆశగానున్నారనెడు తలంపుచేత, నీ మనసులో నుండెడు కానిపక్షము, చెడ్డ సావాసము, మర్మము మొదలయినఅశుద్ధపాపములను త్రోసివేసి మంచి పాపసంకీర్తనమూలముగా ఆత్మను శుద్ధము చేసినపిమ్మట, సాష్టాంగ వందనముతోను, భక్తి ఆశతోను దివ్యసత్ప్రసాదము తీయవలసినది, తీసిన తరువాత నీహృదయములో వేంచేసియుండు దివ్యబాలుడైన జేసునాథుని జూచి, ఆ దివ్యబాలుడు నిజమైన సర్వేశ్వరుడని దృఢముగా విశ్వసించి, నమ్మి, స్నేహించి, వారి అను

గ్రహాములను అధిక మధికముగా, పొగడి ప్రార్థి వలసినది.

---

## స్వామి పుట్టిన పండుగనుండి. కానుక మాత పండుగ వరకు చేయు జపము.

---

1 ది—పొగడ పొగడ అమృతమైన జేసువా, దేవరవారు మీము భూలోకములో అగ్నిని రగిలించ వచ్చితిమని వచనించితిరే, లోక ఆశలచేత శీతలము గొనియుండు మా హృదయములను మీ దేవాగ్ని చేత దహించి, మంచిసమయమునందు మాదేశములో వచ్చి యుందురుగాక, మీతిరునామము సదాకాలము పొగడబడునుగాక. ... ... 1 ప్రి.

2 ది—పొగడ పొగడ అమృతమైన జేసువా, దేవరవారు మీము లోకవెలుగుగా నున్నామని వచనించితిరే, మరణనీడయందును, పాప అంధకారమునందును మునిగియుండు మమ్మును ప్రకాశింపజేయ మంచి సమయమునందు మా దేశములో వచ్చి యుందురుగాక, మీ తిరునామము సదాకాలము పొగడబడునుగాక. ... ... ... 1 ప్రి.

3 ది—పొగడ పొగడ అమృతమైన జేసువా, దేవరవారు మీము సకలమునందును మాత్రుకగా నున్నామని వచనించితిరే, మా క్రియల ఆదియంత

ప్రార్థించుదము.

అనంతకృపనిండిన సర్వేశ్వరా! దేవరవారు సత్యమైన జ్యోతిప్రకాశముచేత ఆరాత్రిని ప్రకాశింపజేయ చిత్తమైతిరే, ఈదివ్య జ్యోతిరహస్యములను ఈలోకములో మేము తెలుసుకొనజేసిన ప్రకారము ఆత్మానంద సంతోషములను మోక్షములో అనుభవించ దయచేయవలయునని మిమ్ము ప్రార్థించుచున్నాము.

ఆమెన్ జేసు.

# బాలజేసునాథుని గురించి స్తోత్ర జపము.

సర్వేశ్వరా నాకుసహాయముగా వీక్షించనవధరించండి, కర్తా, నాకు తోడుపడ త్వరించండి, పితకున్ను సుతునికిన్ని స్పిరితుసాంక్తుకున్ను స్తోత్రము కలుగునుగాక. ... ... 1 జ్యో.

1 ది—మానరక్షణము నిమిత్తము పరమపితయొద్ద నుండిదిగి, స్పిరితుసాంక్తువల్ల గర్భమై, కన్యాస్త్రీయుదరమును అరోచించక వారయైనది మాంసమై రూపమెత్తిన, మహామధురముగల దివ్యబాలుడైన జేసువా మామీద దయగానుండండి, బాలుడైన జేసువా మామీద దయగానుండండి. ... 1 ప్రి

2 ది —మీమాతవల్ల ఎలిశబేతమ్మను సంధించి, మీ స్థానాపతియైన అరుళప్పగారిని స్పిరితుసాంక్తువలన

నింపి, తమతల్లి యుదరములోనే వారిని అర్చింపజేసిన మిగుల మధురముగల దివ్యబాలుడైన జేసువా మామీద దయగానుండండి, బాలుడైన జేసువా మామీద దయగానుండండి. ... 1 ప్రి

3 ది—తొమ్మిది మాసములు కన్యతల్లియొక్క యుదరమందు వాసమైయుండి, అర్చ్య-కన్యమరియమ్మవల్లను, అర్చ్య-జోజప్పగారివల్లను అత్యంతఆశతో ఆపేక్షింపబడి, లోకరక్షణముకొరకు పితయైన సర్వేశ్వరునికి సమర్పించబడిన మిగుల మధురముగల దివ్యబాలుడైన జేసువా, మామీద దయగానుండండి, బాలుడైనజేసువా మామీద దయగానుండండి. 1ప్రి

4 ది—బెత్లెహేం పురియందు కన్యమాతయొద్దనుండిపుట్టి, వస్త్రములతో చుట్టబడి, గాడిలోపరుండబెట్టబడి, సన్మనస్కులచేత ఎరిగించబడి, గొల్లవారలచేత సంధింపబడిన మిగుల మధురముగల దివ్యబాలుడైన జేసువా మామీద దయగానుండండి, బాలుడైన జేసువా మామీద దయగా నుండండి. 1 ప్రి.

కన్యతల్లియొద్దనుండి పుట్టినజేసువా, పితతోనును స్పిరితుసాంక్తుతోనును సదా కాలము మీ కీస్తోత్రము కలుగునుగాక. 1 శ్లో.

(గురువు) జేసునాథుడు మన చెంతనున్నాడు. రాండి నమస్కరించుదము.

5 ది—వృత్త ఛేదనములో ఎనిమిది రోజులకు పిమ్మట గాయపడి జేసువనిన్ను మహామహిమగల నా

మమునుపొంది పేరువల్లనురక్తమువల్లనురక్షకుని కైం
కర్యమునకు ముందు గురించబడిన, మిగుల మధురము
గల దివ్యబాలుడైన జేసువా మామీద దయగానుం
డండి, బాలుడైన జేసువా మామీదదయగానుండండి.
1 ప్రి.

6 ది—త్రోవ చూపరిగానున్న నక్షత్రముచేత
ముగ్గురు రాజులకు కనపరచబడి, తల్లిఒడిలో ఆరా
ధించబడి, బంగారు, ధూపము, మిర్రాయనెడు దేవ
రహస్యకానుకలను కైకొనిన, మిగుల మధురముగల
దివ్యబాలుడైన జేసువా, మామీద దయగానుండండి,
బాలుడైనజేసువా మామీద దయగానుండండి. 1 ప్రి

7 ది—కన్యతల్లివలన దేవాలయములో ఒప్పగించ
బడి, శిమియోను వలన చేతులలో ఎత్తబడి, దీర్ఘదర్శి
నియైన అన్నమ్మగారివలన ఇస్రాయేలులకు ఎరిగించ
బడిన మిగుల మధురముగల దివ్యబాలుడైన జేసువా
మామీద దయగానుండండి, బాలుడైన జేసువా
మామీద దయగానుండండి. ... 1 ప్రి.

8 ది—దుష్ట హెరోదేసుని వలన చావుకు వెదక
బడి, అర్చ్య-జోజప్పగారివలన తల్లితో ఎజిప్తు దేశము
నకు కొనిపోబడి, క్రూరకాలపాతకమునకు తప్పించు
కొని, కళంకములేని వేదసాక్షుల స్తుతులచేత మహి
మపొందిన దివ్యబాలుడైన జేసువా మామీద దయ
గానుండండి, బాలుడైన జేసువా మామీద దయగా
నుండండి. ... ... 1 ప్రి.

9 ది—కన్యతల్లియొద్దనుండి పుట్టిన జేసువా పితతోనును స్పిరితుసాంక్తుతోనును సదాకాలము మీాకే స్తోత్రము కలుగునుగాక. ... ... 1 జో.

10 ది—మహాపరిశుద్ధ కన్య మరియమ్మతోనును, పితాపితృలైన అగ్ప్యే-జోజప్పగారితోనును, హెరోదేసుని మరణమువరకు ఎజిప్తు దేశములో నిలిచియుండిన మిగుల మధురముగల దివ్యబాలుడైన జేసువా మామీాద దయగా నుండండి. బాలుడైన జేసువా, మామీాద దయగానుండండి. ... ... 1 ప్రి.

11 ది—ఎజిప్తు దేశమునుండి తల్లితోనును సాకుతండ్రితోనును ఇస్రాయేల్ దేశమునకు తిరుగా వచ్చి, ప్రయాణములో అనేక కష్టములను అనుభవించి, నజరేత్తూరిలో ప్రవేశించిన, మిగుల మధురముగల దివ్యబాలుడైన జేసువా మామీాద దయగా నుండండి, బాలుడైన జేసువా మామీాద దయగా నుండండి. ... ... 1 ప్రి

12 ది—నజరేతులో పరిశుద్ధ ఇంటియందు తల్లికిని పెంచిన తండ్రికిని మిగుల అడకువతో క్రిందుపడియుండి, దరిద్రమువల్లను, ప్రయాసలవల్లను, ఇక్కట్టు అనుభవించి, వివేకమునందును, వయసునందును, వరప్రసాదమునందును వృద్ధిపొందిన, మిగుల మధురముగల దివ్యబాలుడైన జేసువా మామీాద దయగానుండండి, బాలుడైన జేసువా మామీాద దయగా నుండండి. ... ... ... 1 ప్రి

13 ది—పండ్రెండవ ప్రాయములో జెరుసలేముకు కొనిపోబడి తల్లివల్లను పెంచిన తండ్రివల్లనుకన్నీ తో వెనుకబడి, మూడు రోజులకుపిమ్మట సంతోషముగా వేదశాస్త్రుల సభమధ్య కనుపడిన, మిగుల మధుర ముగల దివ్యబాలుడైన జేసువా మామీద దయగా నుండవడి, బాలుడైన జేసువా మామీద దయగా నుండవడి. ... ... 1 ప్రి.

కన్యతల్లి యొద్దనుండి పుట్టిన దివ్య జేసువా, పిత తోనును స్పిరితుసాంక్తు తోనును సదాకాలము మీ కు స్తోత్రముకలుగునుగాక. ఆమెన్ జేసు. 1 జ్యో.






బెజవాడలో దొరకు

# కతోలిక్ మత గ్రంథములు

క్రీస్తు అమృతాహారము.
సత్యవేద చరిత్ర సంగ్రహము.
మోక్ష మార్గము.
జ్ఞానోపదేశ వివరము.
పాత సంక్షేపము.
ఉత్తరించు ఆత్మల స్మరణమాసము.
బాల జేసునాథునియొక్క నవదిన ప్రసంగము.

☞ పై చెప్పిన పుస్తకములు కావలసినవారలు-

రాజర్షి. హెచ్. ఎం. పెజ్జోనిస్వాములవారు,
కతోలిక్ మిషన్ చెర్చి,
బెజవాడ, కృష్ణాడిస్ట్రిక్టు,
అని వ్రాసికొనవలయును.